కన్పించినను ఆత్మ చైతన్యమునందు భాసించి ఆభాస మాత్రములు అనియు, అవిద్యాజనితము లనియు చెప్పుచూ భూతములుగా కన్పించుట, భూతములు భగవంతునియందు ఉండుటఇదిఅంతయు అభాస మాత్రమే యనియు చెప్పుచూ "మమాత్మా" అను పదమునకు సరియైన వివరణ అందించినట్లగుపడదు.

దృష్టి సృష్టి వాదపరముగా విచారించినట్లైన దృష్టిని విడిచి సృష్టికి స్వతః సత్తాస్ఫూర్తులులేవు గనుక అంతయు సత్తాస్ఫూర్తులే యగును. కాని సృష్టి దృష్టివాదమున విచారించినచో గీతావాక్యమునకు పైవివరించిన వ్యాఖ్యానము సమంజసమని అవగతమగును. వివాదగ్రస్తమగు పైశ్లోకములను విచారించు మానవుని ఆధ్యాత్మిక శక్తి పై రెండును క్రమముగానే కన్పించినను గీతాశ్లోకార్థము ననుసరించి చూచినచో సృష్టి దృష్టి వాదతయా విచారించిన వివరణయే క్రమముగా కన్పించుచున్నది.

ఓం తత్ సత్.

## 28. ఆత్మస్వరూపము

మూ॥ అస్తినాస్త్యస్తి నాస్తీతి నాస్తినాస్తీతి చాపునః।
చలస్థిరో భయాభావై రావృణోత్యేవ బాలిశః॥

భావము :- ఆత్మయున్నదని యొకవాదము, లేదని మరియొక వాదము; ఉన్నదియును, లేనిదియును అనియింకొకవాదము; ఎంత మాత్రములేదని నాల్గవవాదము! ఇట్లు చలము, స్థిరము, చలస్థిరము అత్యంతమ భావమను వివిధ విశేషములచే అజ్ఞులాత్మస్వరూపమును గప్పిపుచ్చుచున్నారు.

అస్తి నాస్తి మొదలగు స్వస్వాభిని విష్టములగు నాలుగు కక్ష్యలచే ఆత్మ భగవానుడు సంస్పృశ్యుడగు చున్నాడు. అతని యందు అస్తి నాస్తి మొదలగు వికల్పనలులేవు. ఇట్లుపనిషత్తులచే

ప్రతిపాదింపబడిన పరమాత్మతత్త్వము నెవడు గ్రహించునో యతడే సర్వజ్ఞుడు పరమార్థపండితుడు నగుచున్నాడు. సర్వజ్ఞమగు బ్రహ్మపదమును పొందినవాడు బ్రాహ్మణుడు ఈయనే మహాజ్ఞాని. పరమహంస పరివ్రాజకాచార్యపదము బ్రాహ్మణశబ్దమునకు ముఖ్యార్థము. ఆపద మాది మధ్యాంత రహితము. అట్టి పదము జ్ఞానస్వరూపము గనుక నది పొందినవాడు సర్వజ్ఞుడగుచున్నాడు. ఇట్టి యాత్మలాభముకంటె నుత్కృష్టమగు మరియొక పదమేదియు లేదు.

ప్రపంచాత్మకమగు నానారూప ద్వైతము స్వతంత్రముగా సిద్ధించుచున్నదా? లేక ఆత్మ తాదాత్మ్యమును బొంది యట్లు భాసించుచున్నాదా? నానారూపమగు ప్రపంచ మాత్మ తాదాత్మ్యమును బొంది యనేకముగ గాన్పింప సాధ్యముగాదు. ప్రపంచము జడాత్మకము. ఆత్మ చేతనాత్మకము. విరుద్ధ స్వభావములుగల జడాజడముల రెండింకిని తాదాత్మ్యభావము ఘటింప శక్యముగాదు. ఆత్మ భేదశూన్యము. ద్వైతమట్టి యాత్మ తాదాత్మ్యమును బొందిన యెడల దానికి నానాత్వమెట్లు సంభవమగును. కరదీపిక కాంతిచేత రజ్జువని నిర్ధారణచేయబడినపుడు దానియందు కల్పింపబడిన సర్పదండాది నానారూపములు కాన్పించుటలేదు. ద్వైతమున కాత్మతో సంబంధములేక స్వతంత్రమగు యునికిగాని, ప్రతీతిగాని లేదు. రజ్జుని రపేక్షకమగు సర్పమెన్నడును సంభవింపదు. మరియు ననేకముగా కాన్పించు ద్వైత మొకదానికంటె మరియొకటి వేరుగా నున్నదా? ఒకదానికంటె మరియొకటి వేరుగా నుండశక్యముగాదు ఒకదానికంటె భిన్నమగునది మరియొకటి యున్నపుడే యొకదానికంటె మరియొకటి భిన్నమగుచున్నది. రెండవదిలేనపుడు ఒకదాని కంటె మరియొకటి లేదను పార్థక్యప్రతీతి సంభవముకాదు. పార్థక్యప్రతీతి వస్త్వంతరాధీనముగాని స్వతంత్రముగాదు. పార్థక్యము లేనియెడల నానాత్వము సిద్ధింపనేరదు. అపుడు ఘటపటములు రెండు నొకటియే యగుచు సర్వవ్యవహారలోపము సంభవించును.

ఇట్లు ద్వైతమాత్మ స్వరూపమనిగాని, తద్భిన్నమనిగాని పార్థక్యమే ముఖ్యలక్షణముగాగల నానాత్వము సిద్ధించునని చెప్ప శక్యముగాదు. ఏవిధముగా జూచినను ద్వైతము వాస్తవముగా నిరూపింప సాధ్యముగాదు. ఆరోపితమగు జగత్తు అధిష్ఠానమగు పరమార్థబుద్ధిచే నాలోచించినపుడు యసన్మాత్రమేగావలసివచ్చును రజ్జుసర్పము దీపకాంతియందు రజ్జువుకంటె వ్యతిరేకముగ నుండ నటుల జగత్తుకూడ పరమాత్మకంటె వేరుగానుండనేరదు. ద్వైతమును నదిలేదు. నానాత్వమున కన్యోన్యముగాగాని, పరమాత్మ తోడ యునికిగాని సిద్ధింపనేరదు. ఆత్మ అద్వితీయము గనుక నానాత్వ మాత్మయని భావింపలేము. ఆత్మ భావములేని నానాత్వమున కునికియేలేదు గనుక నిరాత్మకమగు నానాత్వము జడమాత్రమగు నని తాత్పర్యము. భావధర్మపదము లేక కార్థకములు. అద్వైతులు ధర్మిధర్మములకు, గుణిగుణములకు, జాతివ్యక్తులకు తాదాత్మ్యమం గీకరింతురు. వానికి భేదములేదన్ని వారిమతము. ప్రకృతి కన్యథా భావ మేవిధముగనుసిద్ధింపదు. ఏవస్తువు స్వస్వభావము నెన్నడును వదలిపెట్టదో అయ్యది ప్రకృతి యనబడును. ఏ స్వరూపముచే నేవస్తువు నిశ్చయించబడినదో అది వ్యభిచరించ కుండుటయే దాని ప్రకృతి. సిద్ధపురుషులకు యోగబలముచే సిద్ధమగు అణిమాది శక్తులు ఎపుడును విపర్యయము నొందవు. ఇది వారికి సంసిద్ధమైన ప్రకృతి. అగ్ని మొదలగువానియొక్క ఉష్ణప్రకాశత్వస్వభావము కాలాంతరముననగాని దేశాంతరమందుగాని మార్పునుజెందవు. అది వానిస్వభావమగు ప్రకృతి. పక్షులకు పుట్టుక తోడనే ఆకాశమున కెగురుట మొదలగు లక్షణము లేర్పడుచున్నవి. వానికది సహజ మగు ప్రకృతి, జలమునకు నిమ్నగమనము మొదలగు కొన్ని లక్షణము లేర్పడుచున్నవి. ఇవి వాని కకృతమగు ప్రకృతి. మిథ్యా కల్పితములగు లౌకిక వస్తువులందుగూడ ప్రకృతి మార్పుజెందుట లేదు. జన్మాది వికారరహిత స్వభావమగు పరమార్థవస్తువునుగూర్చి

చెప్పనేల?అమృతమేలక్షణముగాగల దానిప్రకృతి యెంతమాత్రము వితథము గానేరదు. దానికెన్నడు నుత్పత్తి కలుగనేరదు.

మూ॥ యథాస్వప్నే ద్వయాభాసం చిత్తం చలతిమాయయా
తథా జాగ్రద్ద్వయాభాసం చిత్తం చలతిమాయయా।
అద్వయంచ ద్వయాభాసం చిత్తం స్వప్నేన సంశయః
అద్వయంచ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః॥

భావము :- ద్వైతాభాసమును చూచుచున్న చిత్తము స్వప్నమునందు మాయచే చోదితమయి చలించుచున్నది. ఆ తీరుననే జాగ్రత్తునందలి ద్వైతాభాసమునుచూచుచున్న చిత్తముగూడ మాయ చేతనే ప్రేరితమగుచున్నది. స్వభావముగా నద్వయమైన చిత్తము స్వప్నమునందు ద్వైతాభాసముగ కాన్పించుచున్నది. సందేహము లేదు. అదే విధముగ జాగరితమందుగూడ నద్వయమగు చిత్తము ద్వైతాభాసమును గలిగియున్నది.

పరమార్థముచే నద్వయమగు విజ్ఞానమును శబ్దములచే వర్ణించుటకు అజ్ఞానకల్పితమగు మానసిక స్పందనము మాత్రమే కారణం అధ్వయమగు నాత్మను వర్ణింప శబ్దములు ప్రయత్నించుటలేదు. బ్రహ్మతత్త్వము మౌనవ్యాఖ్యచేతనే ప్రకటితమగుచున్నది. కార్య కారణ సంబద్ధమగు ద్వైతమును వివరించుటకు మాత్రమే శబ్దములు ప్రయత్నించుచున్నవి,

విగతాశేష దోషులును, పండితులును,వేదాన్తార్థతత్పరులును సర్వకర్మ సన్న్యాసులునగు వారలకే పరమాత్మోపలబ్ధి సాధ్యముకాని రాగద్వేషాది కలుషిత చిత్తులు, స్వపక్షపాతాభి నివిష్టులానగు తార్కికాదులకది శక్యముకాదు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# 29. భిన్నత్వములో ఏకత్వము

భ. గీ. 6-30 "యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచమయి పశ్యతి।
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతిః॥"

అర్థము :- ఎవరు సర్వత్ర నన్ను (ఈశ్వరుని) దర్శించు దురో, మరియు సర్వమును నాయందు దర్శింతురో, వారికి నేను కన్పడకపోను. వారు నాకు కన్పడకపోరు. సర్వమనగా శబ్ద స్పర్శ రూపరసి గంధాత్మకమగు ప్రపంచము శ్రోత్ర, త్వక్కు, చక్షుః, జిహ్వ, ఘ్రాణేంద్రియములు. పైవిషయములతో సంబంధపడుటయే వ్యావహారిక ప్రపంచము. ఇట్లు ప్రమాతతోగాని, వృత్తితోగాని, విష యమునకుగల యభేదతాదాత్మ్యసంబంధమే, విషయమునందుగల యపరోక్షత్వమునకు హేతువగును. విషయముయొక్క పరోక్షత్వమే జ్ఞానముయొక్క యపరోక్షత్వమునకు హేతువగుచున్నది.

శ్రోత్రేందియ మాకాశము యొక సత్వాంశమువలన బుట్టినది శ్రోత్రమునకు శబ్దముతో శ్రోత్రసంయుక్త తాదాత్మ్య సంబంధము గలుగుచున్నది. ఈ శబ్దము ధ్వనాత్మక శబ్దమనియు, వర్ణాత్మక శబ్దమనియు రెండు విధములు. భేర్యాదివస్తువులతో, దండాదుల సంయోగమువలన గలుగునది ధ్వనాత్మక శబ్ద మనబడును. ఈ ధ్వనాత్మక శబ్దమునందు తారత్వమందత్వాది ధర్మములున్నవి. కంఠాద్యష్ట స్థానములయందు వాయుసంయోగము చె కలుగునది వర్ణాత్మక శబ్దమనబడును. ఈ వర్ణాత్మక శబ్దమునందు కత్వాది ధర్మములున్నవి. ఈ ధ్వనాత్మక వర్ణాత్మకములగు సమస్త శబ్దము లతో శ్రోత్రేంద్రియమునకు సంబంధము గలుగుచున్నది. ఇట్లు వైవిధ్యరూప ధ్వన్యాత్మకశబ్దములు, లౌకిక, శాస్త్రీయమైన సమస్త వైవిధ్య వర్ణాత్మక శబ్దజాలముయొక్క జ్ఞానము, ఒక్కటియైన శ్రోత్రేంద్రియ స్థానమందే తెలియబడి వ్యవహారము జరుగు చున్నది.

త్వగింద్రియము వాయువుయొక్క సత్వగుణాంశమువలన బుట్టినది. త్వగింద్రియమువలన, స్పర్శము, స్పర్శాశ్రయము, స్పర్శాశ్రితమగు స్పర్శత్వజాతి, స్పర్శత్వవ్యాప్యమైన, కఠినత్వాదులు మొదలగు వాని జ్ఞానము కలుగుచున్నది. వైవిధ్యస్పర్శ జ్ఞానములు, ఒక్కటియగు త్వగింద్రియమున తెలియబడి వ్యవహరించబడుచున్నవి. చక్షురింద్రియము అగ్నియొక్క సత్వాంశము వలన బుట్టినది. కాన సమస్త వైవిధ్యరూప నీలపీతాది జ్ఞానములను బొందుచున్నది. ఒక్కటియగు చక్షురింద్రియమునకు, రూపవైవిధ్యమంతయు తెలియబడి వ్యవహారయోగ్య మగుచున్నది.

జిహ్వేంద్రియ ముదకముయొక్క సత్వగుణాంశమున బుట్టినది. ఒక్కటియగు యీ జిహ్వేంద్రియమునందు, మధురము, ఆమ్లము లవణము, కటుకము, కషాయము, తిక్తములను రస వైవిధ్యమంతయు తెలియబడి వ్యవహారయోగ్యమగు చున్నది. ఘ్రాణేంద్రియము పృథివియొక్క సత్వగుణాంశమువలన బుట్టినది. ఒక్కటియగు యీ ఘ్రాణేంద్రియమందు వైవిధ్యరూప సుగంధ, దుర్గంధ వస్తుజ్ఞానము కలిగి వ్యవహారము జరుగుచున్నది. ఇట్లు శబ్దస్పర్శరూప రసగంధ వైవిధ్య ప్రపంచమంతయు, శ్రోత్ర, త్వక్, చక్షః, జిహ్వా, ఘ్రాణేంద్రియములందు ఏకమగు చున్నది. కనుక ఐదు జ్ఞానములు మనస్సునందు ఏకీకృతమగు చున్నవి. మనస్సున్నపుడే ప్రపంచము తోచుచున్నది. మనస్సు లయించిన సుషుప్తియందు స్థూలసూక్ష్మ ప్రపంచమేదియు తోచక లేనిదై యున్నది.

మనస్సు అంతఃకరణవృత్తిరూపము. అంతఃకరణము సూక్ష్మ పంచభూతములను సమష్టి సత్వాంశమగుటవలన, జడమగును. చైతన్యమునందే తెలిసికొనుట జరుగునుగాని, జడమునందు జరుగదు. ఇట్లు చైతన్యమునందు భాసించబడిన సాభాసాంతఃకరణ వృత్తి రూపమగు మనస్సునందు ఈ ప్రపంచము తెలియబడి

వ్యవహార యోగ్యమగుచున్నది. కేనోపనిషత్తు రెండవభాగము, నాల్గవ మంత్రము.

"ప్రతిబోధ విదితం మత మమృతత్వంహి విన్దతే।
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్॥"

అర్థము :- మనస్సుయొక్క ప్రతివికారము (వృత్తి) ద్వారాను దానిని స్ఫూర్తిని గోచరము చేసుకున్నవాడు అమరత్వాన్ని పొందుతాడు. ఆత్మద్వారా అతడు నిజమైన బలాన్ని పొందుతాడు. జ్ఞానముద్వారా అమరత్వాన్ని పొందుతాడు. ఇట్లు చైతన్యరూపుడగు ఈశ్వరునియందే సమస్తము తెలియబడి వ్యవహారము జరుగుచున్నదని గుర్తించినచో, సర్వమునందున, ఈశ్వర చైతన్యమును జూచిన వారమగుదుము. ప్రతివృత్తియందును జడభాగమును విడిచిన సమస్తవృత్తులు తెలియబడునట్టి జ్ఞానము ఏకమైయే నున్నది. ఇట్లు సర్వమునందున ఈశ్వరుని జూచువారు ఈశ్వరునికి కన్పించకపోరు.

ఏకమైన సాక్షిచైతన్యము. అంతఃకరణమందు భాసించగా "అహం" వృత్తిపుట్టును. అనగా "నేను" అనువృత్తిద్వారా జ్ఞానం అభివ్యక్తమైనది. అభాససహిత వాసనాంతఃకరణము నుండి, సర్వవృత్తులు పుట్టి ఆయా యింద్రియములద్వారా బహిర్గతమై ఆయా విషయ సమీపనకుపోయి, విషయావరణనను తొలగించి, విషయజ్ఞానమును కలిగించుచున్నవి. ఇట్లు ఏకమైన సాక్షిచైతన్యమునందే, మనస్సునందు గలుగు వృత్తిరూప అంతర ప్రపంచ జ్ఞానముగాని, మనస్సు ఇంద్రియములద్వారా పొందు శబ్దస్పర్శ రూప రస గంధాత్మకమగు బాహ్య వైవిధ్యరూప స్థూలప్రపంచ జ్ఞానముగాని కలుగుచున్నది. ఇట్లు ఏకరూప సాక్షిచైత్యమునందే సర్వమును దర్శించగలవారికి ఈశ్వరుడుకన్పించకపోడు. ఈవిధముగ బాహ్య జగద్రూప సర్వమునందు ఏకరూప జ్ఞానమును దర్శించుట, ఏకరూపమైన సాక్షిరూప చైతన్యమందే, వాసనాంతఃకరణములందు

గలుగు భిన్నవస్తువులచే సర్వభిన్న ప్రపంచము తెలియబడుచు వ్యవహార యోగ్యమై యున్నదనియు తెలియుటయే పై గీతా శ్లోకార్థము. ఇదియే ఉపనిషత్సారమైన అనేకత్వములో యేకత్వ దర్శనముచేయుటయే బ్రహ్మసాక్షాత్కారమని యెరుంగవలయును

ఓం తత్ సత్

## 30. శాంతిమంత్రము (సదసద్వివేకము)

ఓమ్ అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ,
మృత్యోర్మా౽ మృతంగమయ॥

పై మంత్రము పరమశాంతి కొఱకగుచున్నది.

అర్థము :- ఓ భగవానుడా అసత్తునుండి సత్తునకు తీసికొని పొమ్ము. తమస్సు (చీకటి) నుండి జ్యోతి (వెలుగు) లోనికి తీసుకొనిపొమ్ము. మృత్యువునుండి అమృతత్వమును పొందింపజేయుము.

సత్తు అసత్తు అని లోకములో రెండు పదార్థములు గలవు. సత్తంటే ఉన్నదని, అసత్తంటే లేనిదని అర్థము. ఇందు ఉన్నదేదో ఎప్పుడునున్నది. లేనిదెప్పుడులేదు. ఉన్నదిలేక పోవటంగాని లేని పదార్థముండడంగాని ఎన్నటికిని సంభవింపదు. ఇది సర్వవిదితము విచారించినచో మనము ఉన్నదానిని లేదని లేనిది ఉన్నదని భావించుచున్నాము. ఆత్మచైతన్యము సర్వత్రా సర్వదా యున్నది. దానిని అవిచారితులు లేదనుకుంటున్నారు. అట్లే యీ నామ రూపాత్మక జగత్తు పరిశీలన దృష్టితో జూచినచో లేనిదైనను అనుక్షణమున్నట్లు చూచుచున్నాము. అనగా అసద్రూపముగానున్న నామరూపములలో కన్పించుచున్న కరచరణాద్యవయవరూప సంఘాతము, మనోబుద్ధీంద్రియాది రూపసూక్ష్మ దేహములను సద్రూపముగా భావించి వాటికి సహజముగానున్న "పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట,

మారుట, కృశించుట నశించుట, అను ఆరు పరిణామములకు గురియగుచు, దుఃఖముల పాలగుచున్నాము. ఇట్టి దుఃఖము మార్పు జెందుచున్న అసత్పదార్థమునకున్నది కాన మార్పుచెందని సత్పదార్థము దుఃఖము లేనిదగును. ఏదైన యొకవస్తువును పరిశీలించి నచో సదసద్వి భాగము మనకు అర్థమగును. ఉదాహరణకు ఘట మను వస్తువున్నది. అది దానికి కారణమగు మృత్తికకంటె వ్యతిరిక్తముగాదు. గదా? కాన ఘటమను నామము, రూపము అసత్తే. మృత్పిండమును విచారించిన అది పృథ్వీ పరమాణువుల సంయోగమే పృద్విజల వికారము, జలముతేజఃకార్యము, తేజస్సువాయు జనితము, వాయువాకాశజన్యము, కాన భౌతిక పదార్థములు ఆకాశముకన్న వేరుగలేవు. ఆకాశమచేతనము. కానదానిపాటికది సిద్ధించదు దానికి విలక్షణమైన,పరాధీనముగాని స్వతస్సిద్ధమైనది యొకటుండ వలెను. అలాంటిదొక చైతన్యమే. శ్రుతిః– "అజ్ఞానాద్ బ్రహ్మణో జాత మాకాశం బుద్ బుదోపమమ్, ఆకాశాద్ వాయురుత్పన్నో వాయోస్తే జస్తతఃపయః అద్భ్యశ్చ పృధివీజాతా తతోవ్రీహియవాదికమ్॥"

అర్థము : ఆకాశమునుండి వాయువును, దానినుండి తేజస్సును, దానినుండిజలమును, దానినుండి పృధివియును, దానినుండి వ్రీహి యవాది సస్యములును కలిగినవి. కాబట్టిచైతన్యమే అన్నిభావాలకు చివరి భావము. దానికి కారణంలేదు. కాన అది దేనికి కార్యంకాదు. కాన అది అవ్యభిచారి అనగా మార్పులేకవికారములేనిది. కనుక అది సత్తు. నామరూపాది ప్రపంచమంతా ఆకాశంవరకు వ్యభిచరించే కార్యరూపాలేయని తెలియుగలదు. కాబట్టి మూలకారణమైన శుద్ధ చైతన్యమునకంటె భిన్నముగాలేవు. కనుక చరాచర జగత్తంతా అసత్తే. ఇది కన్పించుచున్నను, అదిస్థూలముగ కన్పించనప్పటికిని యీమనోబుద్ధేంద్రియాదులకు, స్థూలసూక్ష్మములగ గోచరించున దంతయు అదేకాని ఇదికాదు. ఎట్లన బల్లఉన్నది, ఘటమున్నది.

కఱ్ఱ యున్నది. అని భావించునపుడు బల్ల, ఘటము, కఱ్ఱ అను భావములు, ఉన్నది, ఉన్నది, ఉన్నది అనుభావములు సమానాధికరణములుగా కన్పించును, వానిలో బల్ల ఘటము కఱ్ఱ అను భావములు మారుతూ పోతాయి. కాని ఉన్నది అను భావము మార్పు చెందక సదాయున్నది. ఈ ఉండుట అనుభావము బల్ల వగైరాలు నశించినచో లేదుగదాయని ఊహించవచ్చును. ఈ సద్బుద్ధి బల్ల వగైరా నామరూపములు గోచరించినపుడు ఉన్నదియని తెలిసికొనును. అవిలేనపుడు అనగా విశేషనామరూపములు నశించినపుడు సత్ అనే ఉనికికి క్షతిలేదు. ఏలయనగా బల్ల వగైరాలు ఉన్నవని ఎలా చూచావో వాటి యభావమును గూడ ఉన్నదనే చూస్తూ యున్నాము. కాన వస్తువుగా నున్నపుడు లేనపుడు సద్బుద్ధియుండనేయున్నది. బల్లయను బుద్ధి యొకచోట యున్నది. మరియొకచోటలేదు. ప్రపంచములో అణువు మొదలు ప్రతివస్తువుల నామరూపభావనలు మార్పుజెందుచున్నవి. గాన అంతా అసత్తే. అనగా వాని వాని విశేషరూపాలలో అవిలేవు. అన్ని సద్రూపంగా మాత్రము ఏకంగా నున్నవి. ఎండమావుల్లో నీరు కన్పించుచున్నను, వివేకిఎట్లు సూర్యకిరణాలే అట్లు భావించుచున్నవని తలంచునో, అట్లే నామరూపములుగా విశేషించి వేరు వేరుగా కన్పించుచున్నను, వివేకి ఆధారమైన సత్పదార్థమునే చూచును. సత్పదార్థమునకు రూపము లేదు. అసత్పదార్థమునకు రూపముగలదు. కాన సత్తనేదాని వివిధ రూపాలే యీ నామరూపాత్మక ప్రపంచము. సద్రూపముగా యివి సత్యంగాని, తద్రూపంగా కావని సమన్వయించుకున్నచో "సర్వం ఖల్విదం బ్రహ్మ" (చా. ఉ. 3-14-1) యను శ్రుత్యర్థమును తెలిసిన వారమగుదుము. అన్ని విశేషరూపములందు అనువర్తించి యున్న చైతన్యమునుగుర్తించుటయే "తత్త్వదర్శనం యద్భావం తద్భవతి." దేనిలో తాదాత్మ్యముబొందితే అదేఅవుతాడు మానవుడు.

మనమందరము అసద్రూపమైన దేహముతో తాదాత్మ్యము

పొందియున్నాము. అందుచే దానివికారలక్షణములే మనకు సంక్రమించినవి. కాన ఆ వికారములకు దుఃఖించకతప్పదు. సత్పదార్థము లేక ఆత్మానాత్మ విచారణచేసిన తర్వాత విశేషనామ రూపములుగా కన్పించు మనమందరము ఏకరూపమైన, మార్పుచెందని నిత్యమైన స్వప్రకాశమైన సర్వప్రకాశమైన సద్రూపమే అయి వున్నామని తెలియగలము. ఇట్టి బ్రహ్మరూపమును తెలిసికొన్నవాడు "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అని శ్రుతి చెప్పుచున్నది. ఇప్పుడు దుఃఖమునకు స్థానములేదు. నిత్యానంద స్వరూపమేయైయున్నది. ఇట్టివిచారణచేత మాత్రమే పైశాంతిమంత్రములోని "అసతోమాసద్గమయ" అనుదానిని అనగా అసద్రూప నామరూప భావతాదాప్యమునుండి సద్రూపమైన, మననిజరూపమైన చైతన్యభావనయందు తాదాప్యం బొందుటవలన మాత్రమేగాని వేరు మార్గములేదని గ్రహించవలెను

రెండవ చరణము "తమసోమా జ్యోతిర్గమయ" అనగా చీకటి నుండి (తమస్సునుండి) వెలుగులోనికి(ప్రకాశములోనికి) తీసికొనిపొమ్ము ఆత్మజ్ఞానికి ఏది పగలుగా నుండునో అజ్ఞానికది రాత్రిగా నుండును. అజ్ఞానికి ఏదిపగలుగానుండునో ఆత్మజ్ఞానికది రాత్రిగా నుండును.

శ్లో॥ యానిశా సర్వభూతనాం తస్యాం జాగర్తి సంయమీ।
యాస్యాంజాగ్రతి భూతాని సానిశాపశ్యతోమునేః॥ భగ. 2-69

ప్రాణికోట్లు జాగ్రదవస్థయందు స్థూలదేహమునను, స్వప్నావస్థయందు సూక్ష్మదేహమునను, సషుప్త్యవస్థయందు కారణదేహమందున విహరింతురు పిదప సుషుప్తినుండి స్వప్నములోనికి స్వప్నమునుండి జాగ్రత్తలోనికి వచ్చుచుందురు. మాండుక్య కారికలయందు మూ॥ దక్షిణాక్షిముఖే విశ్వోమనస్యన్తస్తుతైజసః। ఆకాశేచహృదిప్రాజ్ఞస్త్రిదా దేహవ్యవస్థతః॥ యని గలదు. టీ॥ విశ్వుడు దక్షిణాక్షిద్వారమునను, తైజసుడు మనస్సునను, ప్రాజ్ఞుడు హృదయాకాశమునను వ్యవహరించుచున్నారు. ఇట్లాత్మ యొకడే

సత్యత్వభావన యున్నపుడు శరీరపు చివరివికారమగు మరణము పొందుచున్నాము. కాన శరీరమునందు సత్యభావనచేయుట మృత భావన. నిత్యసత్యమైన జరామరణ రహితమైయున్న ఆత్మభావన అమృతభావన. కాన శరీరభావననువీడి ఆత్మభావన చేయుటయే అమృతత్వమును బొందుటయని గ్రహించవలెను.

గమనించవలసిన విషయములు:- సత్తు = ఆత్మ, అసత్తు = శరీరము. ఆత్మ ఎల్లపుడును ఉండునది. శరీరము ఎప్పుడులేనిది. అనిచెప్పి వానిమధ్య విరోధము చూపగూడదు. ఇది మనస్సునకు గన్పించు విరోధముమాత్రమే "ఇదిఅంతయు మున్ముందు అసత్తు గానే యుండెను. దానినుండియే సత్తు జనించెను" (తై. ఉ. 2-7) అని ఉపనిషత్తు చెప్పుచున్నది అసత్తు సత్తునకు నిషేధకము గాదు అని యీ వాక్యము చెప్పుచున్నది. నిషేధకమైనచో అనగా అసత్తు కేవలము శూన్యమేయైనచో దానినుండి సత్తు జనింపజాలదు గదా! కనుక సత్తునుగురించిమనకుగల అత్యంతఅమూర్తభావనను సైతం మించినయొక అజ్ఞేయసత్తే అది (అసత్తు) కావలెను. ఇక్కడమనకు స్పష్టపడునదేమనగా బ్రహ్మము అసత్తు అనబడునపుడు ఈఅసత్తు శబ్దం బ్రహ్మంసత్తు కాదనిచెప్పదు, అసత్తు బ్రహ్మంయొక్క వాస్తవ అభివ్యక్తికాదని చెప్పదు. కాని బ్రహ్మము తన అభివ్యక్త సత్తుచేత పరిమితముకాదు అనిమంత్రము తెలుపును తననుతాను అభివ్యక్తం చేసుకొనగల బ్రహ్మముయొక్క స్వేచ్ఛను "సత్తు" శబ్దం తెలుపగా ఆ అభివ్యక్తినుండి బ్రహ్మమునకుగల స్వేచ్ఛను "అసత్తు శబ్దము తెల్పును. ఇకస్వేచ్ఛ ఒకసద్భావము గాన సత్తు అసత్తు శబ్దములు రెండును బ్రహ్మముయొక్క రెండు సద్భావములనే తెల్పును. వివేకబుద్ధితో సత్తునుమారని ఆత్మగాను, అసత్తునుమారుచుండుదాని విస్తారముగాను దర్శించగలము. అసత్తు ఆత్మకు అభివ్యక్తి సాధన మగు స్వీయశక్తి. అట్టి మాయందనాదిగా నాత్మశక్తి యలరు నవ్య క్తమయి జగదాదియగుచు అని సీతారామాంజనేయము చెప్పు

చున్నది. కాన అసత్తును లేనిదియనుకొనుట ఉచితముగాదు. శ్లో॥ నాసతో విద్యతేభావో_నాభావో విద్యతేసతః॥ ఉభయోరపిదృష్టోంత_స్త్వనయోస్తత్త్వ దర్శిభిః॥ భగ. 2_16. అసత్తునకు ఉనికియేలేదు సత్తునకు లేమియులేదు. తత్త్వ దర్శులు యీ రెంటియొక్కయు యిట్టితత్త్వమున దర్శించియున్నారు. అన్నింటిలోను అనువర్తించి యుండు ఆత్మనుదర్శించి పట్టుకోవడమే తత్త్వదర్శనము అప్పుడు యీఅనాత్మప్రపంచముగూడ ఆయావిశేషరూపాలుగా ఆత్మరూపంగానే గోచరిస్తుంది. అప్పుడు ఆత్మానాత్మలరెండింటిని ఆత్మరూపంగా జూచినట్లు ఉభయోరపి దృష్టోంతః అంటే ఏవిధముగా తెలియవలెను. మరి (తై.ట.2_6) "శ్రుతి సత్యంచానృతంచ సత్యమభవత్ యదిదంకిఞ్చ తత్సత్యమిత్యా చక్షతే" సత్యమేసత్యము -సత్యమూ అయినది. ఇది అంతా అదే అయినది. ఆత్మయొక్కటే సత్యమైనప్పటికి జనులు సత్యము. అసత్యము (సత్తు, అసత్తు)అని వ్యవహరించు రెండునుగూడ ఆత్మయే అయివున్నదనిచెప్పెను. అధ్యాస్య భాష్యమునందుగూడ సత్యానృతం మిధునీకృత్యాలోక వ్యవహారః అని చెప్పబడియున్నది. అనగా సత్తు, అసత్తు కలసియే లోకవ్యవహారము కాన సత్, అసత్, తమస్సు, జ్యోతి, మృతం, అమృతం అను అన్నిభావనలు విచారించి అధారమును ఆరోపితమును వివేచించి, ఆరోపితభావమును విడిచి, ఆధారభావమునందు నిధి ధ్యాసనము చేసికొని సర్వభావములకు మూలమగు పరమాత్మయందు భావరహితముగా నుండుటయే పరమశాంతి. అట్టి పరమశాంతినే పై శాంతిమంత్రము మనకు శ్రుతి యుక్తి స్మృతి అనుభవములతో వేనోళ్ళ చాటుచున్నది.

ఓం తత్ సత్.

# ప్రతిదిన స్మరణీయములు

## గాయత్రీ మంత్రము.

ఓమ్ భూర్భువస్సువః తత్స వితుర్వరేణ్యం,
భర్గోదేవస్య ధీమహి ధియో, యోనః ప్రచోదయాత్.॥

అను బ్రహ్మ గాయత్రీ మంత్రమును ప్రతిరోజు ఉదయము (30 నిమిషములు అరగంట) నిశ్చల మనస్సుతో జపింతురుగాక, అట్లనే సాయంత్రము జపించవలెను.

## ప్రాతఃస్మరణమ్.

ప్రాతఃస్మరామి హృదిసంస్ఫురదాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్।
యత్ స్వప్నజాగర సుషుప్తి మవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూతసఙ్ఘః॥ 1

ప్రాతర్భజామి మనసాం వచసామగమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ।
యన్నేతి నేతి వచనైర్నిగమా అవోచం
స్తం దేవదేవ మజమచ్యుత మాహురగ్ర్యమ్॥ 2

ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్।
యస్మిన్నిదం జగదశేషమ శేషమూర్తౌ
రజ్జ్వాం భుజఙ్గమ ఇవ ప్రతిభాసితం వై.॥ 3

శ్లోకత్రయమిదం పుణ్యం లోకత్రయ విభూషణమ్।
ప్రాతఃకాలే పఠేద్ యస్తుస గచ్ఛేత్ పరమం పదమ్॥ 4

# బ్రహ్మాను సంధానము

అహమేవ పరంబ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయమ్।
ఇతి స్యాన్నిశ్చితో ముక్తో బద్ధ ఏవాన్యథా భవేత్॥

అహమేవ పరంబ్రహ్మ నిశ్చితం చిత్త చిన్త్యతామ్।
చిద్రూపత్వాదసఙ్గత్వాద బాధ్యత్వాత్ ప్రయత్నతః॥ 2

అహమేవ పరంబ్రహ్మ న చాహం బ్రహ్మణఃపృథక్।
ఇత్యేవం సముపాసీత బ్రాహ్మణో బ్రహ్మణి స్థితః॥ 3

సర్వోపాధివినిర్ముక్తం చైతన్యం చ నిరన్తరమ్।
తద్ బ్రహ్మాహమితి జ్ఞాత్వా కథం వర్ణాశ్రమీ భవేత్॥ 4

అహం బ్రహ్మాస్మి యోవేద స సర్వం భవతి త్విదమ్।
నాభూత్యా ఈశతే దేవాస్తేషామాత్మా భవేద్ధి సః॥ 5

అన్యోఽసావహ మన్యోఽస్మి త్యుపాస్తే యోఽన్య దేవతామ్।
న స వేద నరో బ్రహ్మ స దేవానాం యథా పశుః॥ 6

అహమాత్మా న చాన్యోఽస్మి బ్రహ్మైవాహం న శోకభాక్।
సచ్చిదానన్దరూపోఽహం నిత్యముక్త స్వభావవాన్। 7

ఆత్మానం సతతం బ్రహ్మ సంభావ్య విహరన్తియే।
న తేషాం దుష్కృతం బ్రహ్మ సంభావ్య విహరేత్ సుఖమ్।
క్షణం బ్రహ్మాహమస్మీతి యః కుర్యాదాత్మచిన్తనమ్॥ 8

తన్మహాపాతకం హన్తి తమః సూర్యోదయో యథా।
అజ్ఞానాద్ బ్రహ్మణో జాత మాకాశం బుద్బుదోపమమ్॥ 9

ఆకాశాద్ వాయురుత్పన్నో వాయోస్తేజస్తతః పయః।
అద్భ్యశ్చ పృథివీ జాతా తతో వ్రీహియవాదికమ్॥ 10

పృథివ్యప్సు పయో వహ్నౌ వహ్ని ర్వాయౌ నభస్యసౌ।
నభోఽప్యవ్యాకృతే తచ్చ శుద్ధేఽస్మ్యహం హరిః॥ 11

అహం విష్ణు రహం విష్ణు రహం విష్ణు రహం హరిః।
కర్తృభోక్త్రాదికం సర్వం తదవిద్యోత్థ మేవచ॥ 12

అచ్యుతోఽహ మనన్తోఽహం గోవిన్దోఽహ మహం హరిః।
ఆనన్దోఽహమ శేషోఽహ మజోఽహమమృతో స్మ్యహమ్॥ 13

నిత్యోఽహం నిర్వికల్పోఽహం నిరాకారోఽహ మవ్యయః।
సచ్చిదానన్దరూపోఽహం పఞ్చకోశాతిగోఽస్మ్యహమ్॥ 14

అకర్తాహ మభోక్తాహ మసఙ్గః పరమేశ్వరః।
సదా మత్సన్నిధానేన చేష్టతే సర్వమిన్ద్రియమ్॥ 15

ఆదిమధ్యాన్తముక్తోఽహం నబద్ధోఽహం కదాచన।
స్వభావనిర్మలః శుద్ధః స ఏవాహం న సంశయః॥ 16

బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహమితి భావయేత్।
అశక్నువాన్ భావయితుం వాక్యమేతత్ సదాభ్యసేత్॥ 17

యదభ్యాసేన తద్భావో భవేద్భ్రమర కీటవత్।
అత్రాపహాయ సన్దేహమభ్యసేత్ కృతనిశ్చయః॥ 18

ధ్యానయోగేన మాసైకాద్ బ్రహ్మహత్యాం వ్యపోహతి।
సంవత్సరం సదభ్యాసాత్ సిద్ధ్యష్టక మవాప్నుయాత్॥ 19

యావజ్జీవం సదాభ్యాసాజ్జీవన్ముక్తో భవేద్ యతిః।
నాహం దేహో న చ ప్రాణో నేన్ద్రియాణి తథైవ చ॥ 20

న మనోఽహం బుద్ధిశ్చనైవ చిత్తమహంకృతిః।
నాహం పృథ్వీ న సలిలం న చ వహ్నిస్తథాఽనిలః॥ 21

న చాకాశో నశబ్దశ్చ న చ స్పర్శస్తథా రసః।
నాహం గన్ధో న రూపం చ న మాయాహం న సంసృతిః॥ 22

సర్వదా సాక్షిరూపత్వాత్ శివ ఏవాఽస్మి కేవలః।
మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్॥ 23

మయి సర్వం లయం యాతి తద్ బ్రహ్మాస్మ్యహ మద్వయమ్।
సర్వజ్ఞోఽహ మనన్తోఽహం సర్వేశః సర్వశక్తిమాన్॥ 24
ఆనన్దః సత్యబోధోఽహమితి బ్రహ్మానుచిన్తనమ్।
అయం ప్రపఞ్చో మిథ్యైవ సత్యం బ్రహ్మాహమవ్యయమ్॥ 25
అత్ర ప్రమాణ వేదాన్తా గురవోఽనుభవస్తథా।
బ్రహ్మైవాహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక॥ 26
నాహం దేహో న మే దేహః కేవలోఽహం సనాతనః।
ఏకమేవా ద్వితీయం వై బ్రహ్మణో నేహ కిఞ్చనః॥ 27
హృదయ కమలమధ్యే దీపవత్ వేదసారం,
ప్రణవమయమతర్క్యం యోగిభిర్ధ్యానగమ్యమ్।
హరి గురు శివయోగం సర్వభూతస్థమేకం,
సకృదపి మనసావై చిన్తయేద్ యః సముక్తః॥ 28

## దక్షిణామూర్తి స్తోత్రము

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం,
వర్షిష్ఠాన్తేవ సదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేన్ద్రం కరకలితచిన్ముద్ర మానన్దమూర్తిం,
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే॥

విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 1

బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున-
ర్మాయాకల్పిత దేశకాలకనలనా వైచిత్ర్య చిత్రీకృతమ్।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 2

యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్।
యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 3

నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే।
జానామీతి యమేవభాంతమనుభాత్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 4

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించ శూన్యం విదుః
స్త్రీబాలాంధజడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం వాదినః
మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 5

రాహుగ్రస్తదివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్।
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 6

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థా స్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహమి త్యంతస్స్ఫురంతం సదా।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయా ముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమః ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 7

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్త్రాద్యాత్మనా భేదతః।
స్వప్నే జాగ్రతివా యఏష పురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 8

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్త్రాద్యాత్మనాఽ భేదతః ।
స్వప్నే జాగ్రతివా యఏష పురుషో మాయాఽపరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 9

భూరంభాం స్యనలోఽనిలోంబర మహర్నాథో హిమాంశుః పుమాన్,
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్।
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 10

సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్।
సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వతః
సిద్ధ్యే త్తత్పున రష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్॥ 11

## సర్వ శాస్త్రసారము

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

సమస్త జగత్తునకు ధర్మము ఆధారము.

"యతో ధర్మస్తతో జయః"

ఎక్కడ ధర్మముండునో అక్కడ జయ ముండును.

"ధర్మో రక్షతి రక్షితః"

మనము ధర్మమును కాపాడిన మనలను ధర్మము కాపాడును.

"స్వకర్మణా త మభ్యర్చ్య"
స్వధర్మానుష్ఠానమే పరమేశ్వరారాధనము.

"తస్మాత్ సిద్ధిః తపసః"
స్వధర్మానుష్ఠాన మనెడి తపస్సువలన అభీష్టసిద్ధి యగును.
కావున ఎవరి ధర్మములను వారు చక్కగా నిర్వర్తింపవలెను.
దానిచేత లోకక్షేమ మగును.

"న గురో రధికమ్"
సద్గురువును మించిన దేదియును లేదు.

"మా మేకం శరణం వ్రజ"
నన్నొక్కనినే శరణు జొచ్చుము.

"ఏకం మాం శరణం వ్రజ"
అఖండముగా నుండు నన్ను శరణు జొచ్చుము.

"తత్త్వమేవ త్వమేవ తత్"
అదియే నీవు. నీవే అది.

"నేహ నానాఽస్తి కించన"
ఇచట నానాత్వమేమియు లేదు-ఇందు ఏదియు లేదు.

"స ఆత్మా"
అదియే ఆత్మ - అదియే నిజరూపము.

"అఖండైకరసం సర్వమ్"
సర్వము అఖండము, ఏకరసము-అభిన్నస్వభావము.



# తప్పు, ఒప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 8 | ణ్ణ | డ్డ |
| | 17 | ఘంటాపద | ఘంటాపథ |
| 4 | 17 | బ్రహ్మమ | బ్రహ్మను |
| 5 | 12 | దహిమింప | దమింప |
| | 13 | తాతు | తీతు |
| 6 | 16 | భక్తిస్తద్ధ | భక్తిశ్రద్ధ |
| 8 | 23 | భోక్త | భోక్తృ |
| 9 | 12 | కగత్తు | జగత్తు |
| 12 | 5 | ఉత్ఫా | ఉత్పా |
| | 24 | హార్మనో | హుర్మనో |
| 14 | 3 | ఆకృతీ | ఆకృతీ |
| | 19 | వస్తూనుం | వస్తువుం |
| | 14 | భావిసే | భావిస్తే |
| 16 | 4 | నిస్బంతు | నిస్పంతు |
| 17 | 15 | శ్రోతం | శ్రుతం |
| | 16 | ప్రాణేనవ | ప్రాణేనన |
| | 18 | యేదప్రాణః | యేనప్రాణః |
| | 22 | ఆరూర | ఆరూఠ |
| 19 | 9 | శరజింప | రజింప |
| | 10 | చ్ఛా | ఛా |
| | 26 | చుననున్న | చున్నను |
| 23 | 2 | చిత్తే | చిత్తై |
| 26 | 16 | యనబడును | మనబడును |
| | 20 | యనబుడును | మవబడును |
| 27 | 6 | లభ్యతే | లభతే |
| | 8 | యనబడును | మనబడును |
| 37 | 13 | కర్తృత్వి | కర్తృత్వా |
| 38 | 15 | అనుసరము | అవసరము |
| 39 | 22 | భయగ్రస్థు | భయగ్రస్తు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 40 | 17 | ఏదైవ | ఏదైన |
| 42 | 2 | మానసాయై | మానసాస్యై |
| | 3 | దృష్టిసాయై | దృష్టిసాన్యై |
| | 17 | దృకదై | దృకై ॥ |
| 41 | 1 | తిఙ్చ | కిఙ్చ |
| 45 | 11 | సదివ్యాకృత్వము | సదవ్యాకృతము |
| 46 | 9 | ఆదిదేడని | అదిదేవుడేని |
| | 15 | దిష్టా | దిష్టాన |
| 48 | 10 | ప్రలయ | ప్రళయ |
| 50 | 27 | మెన | మైన |
| 52 | 13 | తద్ర్బహ్మయ | తద్బ్రహ్మయ |
| 54 | 2 | నారయ | నారాయ |
| | 27 | ఖాగము | భోగము |
| 57 | 8 | మొక్కటి | యొక్కటి |
| 58 | 6 | మంజం | మఃజం |
| 59 | 6 | యిందేద్రి | యిఃదేది |
| 60 | 19 | జానేం | జ్ఞానేం |
| | 20 | అంత | అంతః |
| 61 | 11 | బహిర్గ | బహిర్గత |
| 62 | 12 | రహితాధిక | రహితాంతః |
| 63 | 5 | అవస్థులు | అవస్థలు |
| | 12 | స్థితి | స్థిత |
| | 16 | యుండదు | గలిగియుంటుట |
| | 22 | ప్రత్య | ప్రత్యక్ |
| 64 | 22 | విశ్వభావే | విశ్వాభావే |
| 65 | 24 | గాను | గాదు |
| 66 | 26 | విద్యవిదా | విద్యావిద్యా |
| | 27 | భ్రాంతితితో | భ్రాంతితో |
| 67 | 4 | బ్రహ్మజాను | బ్రహ్మజ్ఞాను |
| 68 | 9 | హేతువై | హేతువై |
| | 12 | నిద్దెదని | నిద్దైదని |
| | 14 | గలదు | — |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 68 | 16 | దునను | దున్నను |
| 69 | 1 | రూపుడగు | రూపుడుగ |
| | 5 | మిదయు | మదీయు |
| 71 | 8 | సరూప | స్వరూప |
| 72 | 6 | ఐదేది | ఏదేది |
| 74 | 3 | మనస్సుక | మనస్సునకు |
| 76 | 14 | బిందుప | బిందూప |
| 77 | 20 | యుండవు | యుందవు |
| 78 | 20 | సూర్యుడే | సూర్యుడీ |
| 79 | 8 | నిద్రలోనికి | నిద్రలోని |
| 81 | 19 | ఇట్లేను | ఇట్లైనను |
| 82 | 15 | మోక్షరూగ | మోక్షరూప |
| 84 | 14 | అనుభవించు | అనుభవింప |
| 86 | 16 | తత్త్వజ్ఞీన | తత్త్వజ్ఞాన |
| 86 | 10 | మాత్ర ంమవుడు | మాత్రమంటవు |
| 89 | 5 | సంసారము | సంస్కారము |
| 89 | 2 | నలభ్యం | నలభ్య |
| 90 | 10 | అతడేయే | అతడాయా |
| 91 | 17 | బబస్పర్ప | శబ్దస్పర్శ |
| 9? | 17 | మనాదుల | మననాదుల |
| 93 | 5 | చి।త్రప్రకా | చిత్ప్రకా |
| | 22 | నేనేవ | నేనెవ |
| 94 | 27 | వని | నవి |
| 95 | 13 | సాక్షికే | సాక్షికి |
| 96 | 21 | కోక్కనికి | కొక్కనికి |
| 97 | 7 | మోక్షార్థ | మోక్షార్థి |
| | 11 | బాధ | బోధ |
| 98 | 26 | కటినాది | కఠినాది |
| 99 | 23 | చిత్తంను | చిత్తమును |
| 100 | 6 | మహాత్మాం | మహతాం |
| | 6 | యతాః | యతః |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 100 | 12 | సానుయతే | సానుమతే |
| | 18 | శీ | మ్యై |
| 102 | 2 | శాస్త్రము | శాస్త్రము |
| | 24 | బ్రహ్మత | బ్రహ్మత |
| 103 | 13 | నొచనై | నాచేనై |
| 105 | 2 | ప్రత్యఘిన్న | ప్రత్యగఘిన్న |
| | 13 | పరమతాః | పరమతా |
| 106 | 19 | బ్రహ్మైస్మి | బ్రహ్మైక్య |
| 108 | 5 | వటనే | వలనే |
| 110 | 10 | ప్రత్యభిన్న | ప్రత్యగభిన్న |
| 111 | 19 | నిక్షంచ | నిష్ప్రపంచ |
| 116 | 3 | నద్వి | సద్వి |
| | 9 | చున్నడు | చున్నాడు |
| 117 | 21 | ఇష్టల్య | ఇష్ట |
| | 23 | లౌకికో | లౌకిక |
| 118 | 2 | నాయనా | సాయనా |
| 119 | 25 | సర్వ్యాపాధు | సర్వోపాదు |
| 120 | 2 | నేకత్వము | నేకత్వ |
| 121 | 23 | యసహ | యజహ |
| 122 | 20 | పరించు | వర్తించు |
| 123 | 1 | అక్ష్యము | లక్ష్యము |
| | 2 | లక్షణము | లక్షణము |
| | 4 | మవశ్యము | మశ్యము |
| 124 | 1 | పాదన | పాదానీ |
| | 2 | పాదనత్వ | పాదానత్వ |
| | 23 | యఘాన్పది | యథాప్పధి |
| 125 | 9 | తాదాత్మ | తాదాత్మ్య |
| | 27 | నివారణ | నివారణకు |
| 126 | 4 | ద్దేశం | ద్దేశ |
| | 24 | ●సత్తైన | అనత్తైన |
| 129 | 1 | సృజించెనని | సృజించెనన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 8 | సుహాసనః | మహాసనః |
| | 25 | ఘటమానయమను | ఘటమానయ అను |
| 137 | 15 | స్త్రద్వైక్య | స్త్రద్వైక్యే |
| 139 | 10 | పురుషుని | పురుషుల |
| 142 | 7 | ద్వైత | ద్వైత |
| 143 | 2 | వితధము | వితథము |
| | 10 | స్వభానముగా | స్వభావముగా |
| 144 | 2 | ప్రణిశ్యతిః | ప్రణశ్యతి |
| | 6 | రూపదసి | రూపరస |
| | 14 | ద్వనాత్మక | ద్వన్యాత్మక |
| | 16 | ద్వనాత్మక | ద్వన్యాత్మక |
| | 17 | ద్వనాత్మక | ద్వన్యాత్మక |
| | 20 | ద్వనాత్మక | ద్వన్యాత్మక |
| 145 | 24 | భూతములను | భూతముల |
| 149 | 11 | వస్తుగా | వస్తువుగా |
| | 17 | భావించు | భాసించు |
| 150 | 18 | జాగర్త | జాగర్తి |
| | 21 | సషుప్త్యే | సుషుప్త్యే |
| | 24 | మనస్పస్త | మనస్యన్త |
| | 25 | దేహ | దేహే |
| | 25 | వ్యవస్థతః | వ్యవస్థితః |
| 152 | 6 | మన్నించ | గమనింప |
| 153 | 9 | ఏ విధము | యీ విధము |

(గాయత్రీ మంత్ర రహస్య వ్యాఖ్యాన సహిత)

# శంకరాద్వైత వ్యాసమాల-3

## మూడవ భాగము



రచయిత:



రనేని విష్ణుశంకరరావు
గుడివాడ. (కృష్ణాజిల్లా)

# విషయసూచిక

పేజీ నెం





# శాంతిపాఠం

ఓం భద్రం కర్ణేభి శ్శృణు యామదేవాః
భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టు వాగ్ంసస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః

దేవాః దేవతలారా,. (వయం మేము) కర్ణేభిః=మా చెవులతో, భద్రం=శుభవాక్యములను, శ్రుణుయామ విందుముగాక, అక్షభిః= మా కనులతో, యజత్రాః=పూజనీయములైన భద్రం= శుభరూపములను, పశ్యేమ= చూచెదముగాక। స్థిరైః= చంచలములుకాని, అంగైః= అవయవములుగల, తనూభిః= శరీరముతో, తుష్టువాగ్ంసః= స్తుతించుచు, దేవహితం భగవంతుడిచ్చిన, యత్ ఏ, ఆయుః ఆయువు గలదో, తత్ దానిని, వ్యశేమ పొందుదుముగాక। తా॥ ఓ దేవతలారా! గురు శిష్యులమగు మేము మా చెవులతో నిరంతరము శుభవాక్యములనే విందుముగాక। మా కనులతో పూజనీయములైన శుభరూపములనే చూచెదముగాక। భగవంతుడిచ్చిన ఆయువు ఉన్నంతవరకు చంచలములు కాని అవయవములుగల శరీరములతో మిమ్ములను స్తుతించు, చుందుముగాక।

స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః, స్వస్తినః పూషావిశ్వవేదాః, స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తినో బృహస్పతి ర్దధాతు.

ఓం శాంతిః, శాంతిః, శాంతిః।

వృద్ధశ్రవాః పురాణప్రసిద్ధుడైన, ఇంద్రః = ఇంద్రుడు, నః=మాకు, స్వస్తి క్షేమమును, విశ్వవేదాః=సర్వజ్ఞుడగు, పూషా= సూర్యుడు, నః=మాకు, స్వస్తి= జ్ఞానమును, అరిష్టనేమిః=అరిష్టము

లను బాపు, తార్క్ష్యః=గరుడుడు, నః=మాకు, స్వస్తి=అనర్థరహిత మును (మేలును) బృహస్పతి = బృహస్పతి, నః = మాకు, స్వస్తి = ఆత్మవిద్యను, దధాతు = కలుగజేయుదురు గాక. తా॥ ఇంద్రుడు, సూర్యుడు, గరుడుడు, బృహస్పతి గురు శిష్యులమగు మాకు సుఖమును, జ్ఞానమును, అనర్థ నివృత్తిని, ఆత్మవిద్యను అనుగ్రహింతురు గాక! ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక శాంతి చేకూరును గాక!



# ఆశ్రమ మహిమ - ఆచరణ

మానవ జీవితమును నాలుగాశ్రమములుగా శాస్త్రము చెప్పు చున్నది. అవి బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము మరియు సన్యాసాశ్రమము. బ్రహ్మచర్యాశ్రమమున సకల విద్యలు గురువులవద్ద నభ్యసించవలెను. గృహస్థాశ్రమములో భార్యా పుత్రాదులతో ధర్మనిష్ఠతో త్యాగ బుద్ధితో జీవితము గడపవలెను. వానప్రస్థాశ్రమములో కుటుంబ భారమంతయు బిడ్డలకు వదలి ఒంటరిగా మనశ్శాంతితో నుండవలెను. సన్యాసాశ్రమములో సర్వము వదలి కాషాయాంబరధారియై దేశ సంచారము చేయుచు స్వస్వరూపజ్ఞాన సముపార్జనములో నిమగ్నుడై జీవించవలెను.

ఇందు గృహస్థాశ్రమము శ్రేష్ఠమా సన్యాసాశ్రమము శ్రేష్ఠమా యను విషయమును ఒక కథారూపముగా తెలిసికొనుట మంచిది.

కళింగ దేశమును పాలించుచుండిన రాజునకు గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనదా ? సన్యాసాశ్రమము శ్రేష్ఠమైనదా ? అను సందేహము కలిగెను. ఒకనాడు పట్టణములోని పండితుల నందరిని పిలిపించి, తన సందేహమును తెలిపెను. వారు గృహస్థాశ్రమము మంచిదని తెలిపిరి. కాని వారు సరిఅయిన హేతువులతో నిరూపింప లేక పోయిరి. తరువాత ఆ పట్టణమునకు వచ్చుచున్న సన్యాసుల నందరిని తన యాస్థానమునకు రప్పించి తన సందేహమును తెలుపు చుండెను వారు సన్యాసాశ్రమము శ్రేష్ఠమైనదని పలుకుచుండిరి. కాని సరియైన హేతువులతో నిరూపించలేక పోవుచుండిరి.

ఒకనాడు ఒక సమర్థుడైన సన్యాసి ఆ పట్టణమునకు వచ్చెను. రాజు ఆ సన్యాసిని రావించి గౌరవించి గృహస్థాశ్రమము,

సన్యాసాశ్రమములలో నేది శ్రేష్ఠమైనదని ప్రశ్నించెను. సన్యాసి, ఆశ్రమములలో గొప్పతనము లేదు, ఆచరణమునందే గొప్పతన మున్నదని చెప్పెను. రాజు దీనిని సహేతుకముగా నిరూపించ గలరా యని అడిగెను. అందులకా సన్యాసి నీవు కొంతకాలము నాతో సంచరించినచో నీకు చక్కగా నిరూపించగలనని చెప్పెను. జిజ్ఞాసువైన రాజందులకు సమ్మతించి రాజ్యమును మంత్రి కప్పగించి తాను సామాన్య వేషముతో సన్యాసి వెంట బయలుదేరెను. ఇరువురు దేశ దేశములు తిరుగుచుండిరి.

మాళవదేశపు రాజునకు పుత్త్రసంతానము లేదు. యుక్త వయస్సుగల యొక పుత్రికమాత్ర ముండెను. ఆ రాజు తన కుమార్తె వరించిన ఏ వర్ణపువాడైనను, యే యాశ్రమము వాడైనను, ఏ మతమువాడైనను, వానికి తన రాజ్యముతోకూడ తన పుత్రిక నిచ్చెదనని స్వయంవరము చాటించెను. ఆ స్వయంవరమునకు దేశదేశములనుండి ప్రభువులును, ప్రజలును గుంపులు గుంపులుగా వచ్చియుండిరి. ఆ సమయముననే సౌందర్యవంతుడు యువకుడునగు ఒక సన్యాసి అచటికి వచ్చెను. ఆ స్వయంవరమునకు వచ్చినవారి నందఱిని మంత్రి రాజకుమార్తె కెఱిగించెను. కాని ఆమె వారి నెవ్వరిని పరిగ్రహింపక, బాలభానునివలె ప్రకాశించు తేజోవంతుడైన యువక సన్యాసి మెడలో పుష్పహారము వేసెను. అది చూచి ఆ సన్యాసి విస్మయమునొంది ఆ హారమును త్రెంచి పారవైచి పోవుచుండెను.

సన్యాసియైన తనకు రాజకుమార్తె నీయడని తలంచి పోవుచున్నాడని గ్రహించి, రాజు ఆ యువక సన్యాసిని సమీపించి, మీరు సందేహింపవలదు. నా పుత్రికను రాజ్యముతోసహా నేడే మీ కొసంగెదను. స్వీకరింపుడని కోరెను. కాని ఆ సన్యాసి యంగీకరింపక యరణ్యమునుబట్టి పోవుచుండెను. రాజకుమార్తె

నేను వరించిన ఆ సన్యాసియే నా భర్త, అన్యుని స్వీకరింపనని వానిని వెంబడించెను. ఆ వినోదమును చూచుటకు మన కథానాయకు లగు రాజ సన్యాసు లిరువురును ప్రచ్ఛన్నముగ వారిని వెంబడించి పోవుచుండిరి. వీరొక మహారణ్య మధ్యముగా పోవుచుండగా ప్రొద్దుకుంకినది. ఆ యువక సన్యాసి అరణ్య మధ్యమున యెవరికి కన్పించకుండా తప్పించుకొని పోయెను. అప్పుడు రాజకుమార్తె యెటుబోవుటకును తోచక యొకచెట్టుక్రింద కూలబడి ఏడ్చుచుండెను. ఆ సమయమున మన కథానాయకులగు రాజ సన్యాసు లిరువురు ఏమియు తెలియనివారివాలె, ఆమెను సమీపించి, ఆమె వృత్తాంతము నడిగిరి. ఆమె జరిగిన కథ అంతయు చెప్పెను. అప్పుడు వారు, సన్యాసి సర్వాత్మ స్వరూపుడు, నీవు సన్యాసిధర్మ మెరుగనిదాన వగుటవలన అతనిని వరించి యుంటివి. రేపు సూర్యోదయమైన తర్వాత నిన్ను మీ తండ్రియొద్దకు చేర్పించెదము మరియొక రాజపుత్రుని వివాహమాడి సుఖింపుము అని చెప్పిరి. వారు ముప్పురు ఒక చెట్టుక్రింద బసచేసిరి.

ఆ చెట్టుమీద రెండు కపోతపక్షులు గ్రుడ్లు పెట్టి పిల్లలను చేసి యున్నవి. అందు మగపక్షి చెట్టుక్రింద కూర్చుండియున్న వీరిని చూచి, మన నివాసమునకు ముగ్గురు అతిథులు వచ్చియున్నారు. మనము గృహస్థాశ్రమమున నుండుటచేత వారిని సత్కరించుట మన ధర్మము. చలిబాధకు తాళజాలక గడగడా వణకుచున్నారు. నీవు ఈ యరణ్యమున చిదుగులను ప్రోగుచేయుము. నేను యీ సమీపమునందున్న పల్లెకు పోయి నిప్పు కొఱివి తెచ్చెదనని ఆడుపక్షికి చెప్పి తాను పల్లెకుపోయెను. ఇంతలో నాడుపక్షి చిదుగులను పేర్చి, మగపక్షి తెచ్చిన నిప్పుకొఱివి నందులోనుంచి రెక్కలతో విసరి మంటజేసెను.

అప్పుడా అతిథులు ముగ్గురా మంటయొద్ద చలి కాచుకొనుచు నాకలిచే బాధపడుచుండిరి. అదిచూచి మగపక్షి పాపము! వీరికి

చలిబాధ పోయినది. ఆకలిబాధ యెక్కువైనది. ఆకలిబాధ తీర్చుటకు వేఱుపాయము కానరాదు. నేనా యగ్నిలో ప్రవేశించి, యీ అతిథుల కాహారమయ్యెదనని చెప్పి యగ్నిలో ప్రవేశించెను. తరువాత ఆడుపక్షి నా భర్త ప్రారంభించిన అతిథియజ్ఞము పూర్తి అయినట్లు లేదు. ఒక చిన్న పిట్టమాంసము ముగ్గురు అతిథులకెట్లు సరిపోవును అని తలంచి తానుకూడ నగ్నిలో ప్రవేశించెను. అటు పిమ్మట ఆ పక్షి పిల్లలు మా తల్లిదండ్రులు ప్రారంభించిన యీ యజ్ఞము పూర్తియైనట్లు లేదు. ఈ చిన్న పిట్టల మాంసము వారికి చాలినట్లు లేదు. కావున మనమా యజ్ఞమును పూర్తిచేయుట ధర్మమని తలంచి యా యగ్నిలో ప్రవేశించెను.

చలి కాచుకొని, ఆకలి దీర్చుకొని, రాజసన్యాసులు రాజ కుమార్తె ముగ్గురు ఆ రాత్రి యరణ్యమునగడపి మరునాడుదయమున రాజకుమార్తెను ఆమె తండ్రివద్దకు తీసికొనిపోయి వప్పగించి, రాజసన్యాసులు ప్రయాణము సాగించిరి. అప్పుడు రాజు సన్యాసితో అయ్యా! ఏ ఆశ్రమము గొప్పదో సహేతుకముగ నిరూపించెదనని చెప్పి, మీరు సంవత్సరము నుండి దేశదేశములు త్రిప్పుచు నింత వరకు నాకు చెప్పరైతిరి. ఇంకెప్పుడు చెప్పెదరని యడుగగా, ఆ సన్యాసి, రాజా! నేను నీకు ప్రత్యక్షముగనే చూపియుంటిని, కాని నీవు తెలిసికొనజాలవైతివి. గృహస్థాశ్రమమునందుండ దలచినచో కపోతపక్షులవలె స్త్రీ పుత్ర దేహాదులయందు భ్రాంతిని విడిచి స్వధర్మ నిర్వహణము కొఱకై ప్రాణముల నర్పించుటకైనను సిద్ధపడవలయును. సన్యాసాశ్రమమున నుండదలచినచో నా యువక సన్యాసివలె త్రిలోకాధిపత్యము లభించినను, సౌందర్యవతియగు

స్త్రీ లభించినను గడ్డిపోచతో సమానముగ చూచి తృణీకరింప వలయును. ఇందాశ్రమములలో గొప్పతనము లేదు. ఆచరణ మందే గొప్పతన మున్నదని చెప్పెను. రాజంతయు సంతోషించి తన రాజ్యమునకు జేరి సర్వ భ్రాంతులనువీడి గృహస్థాశ్రమమునందే యుండి గార్హస్థ్య వివిదిషా సన్యాసమును గ్రహించి జనకాదులవలె జ్ఞానమును పొంది మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడయ్యెను. కాన ఆశ్రమముకంటె నాచరణము శ్రేష్ఠమని గుర్తించవలెను.

ఓం తత్ సత్



# సర్వజితం

పూర్వము భీమసేనుడను మహారాజు పృథ్వీమండలము నంతటిని జయించి, సామ్రాజ్యాధిపతియై సర్వజిత్తను నామము పొందెను. ప్రజలందరు అతనిని సర్వజిత్తనియే వ్యవహరించు చుండిరి.

కాని యింటివద్ద తల్లిమాత్రము పూర్వమువలెనే భీమసేను డనియే పిలుచుచుండెను. ఒకనాడతడు తన తల్లితో లోకులందరు నన్ను సర్వజిత్తని పిలుచుచుండిరి. కాని నీవు మాత్రము నన్ను పూర్వమువలెనే పిలుచుచుంటివి. నేను సమస్త భూమండలమును జయించి సామ్రాజ్యాధిపతి నైతిని. సర్వము నా యాజ్ఞప్రకారము నడుచుచున్నది. ఇంకను నీవు నా ప్రతాపమును గుర్తింపక పూర్వము వలెనే జూచుట నాకు చిన్నతనముగ నున్నదనెను.

ఆ మాటలు విని తల్లి నాయనా! నీవు మహాశూరుడవని వినుటచేత నేను ధన్యురాలనైతిని. నీవు పృథ్వియందుగల బాహ్యశత్రువులను, కామక్రోధాద్యంతశ్శత్రువుల నందరిని సమూలముగా జయించితివా?. బాహ్యమైన పృథ్వీరాజ్యము, ఆంతరమైన దేహేంద్రియ మనోబుద్ధులును నీ స్వాధీనమునందున్నవా? బాహ్యశత్రువులను జయించినంత మాత్రమున మానవుడు శత్రుజిత్తు కానేరడు. ఆంతరములగు కామక్రోధాది శత్రువులను జయించినవాడే శత్రుజిత్తనబడును. పృథ్వీరాజ్యమును తన వశమునందుంచుకున్న మాత్రమున సర్వసామ్రాజ్యాధిపతి కానేరడు. దేహేంద్రియ మనోబుద్ధులను వశీకృతమొనర్చుకొనినవాడే సామ్రాజ్యాధిపతి యగును.

బిడ్డా! ప్రపంచమంతయు నీ యాజ్ఞప్రకారము వర్తించుచున్నదంటివిగదా! నీ దేహేంద్రియ మనోబుద్ధులు నీ యాజ్ఞప్రకారము వర్తించుచున్నవా?. ఈ శరీరము ప్రతిదినము నీ యాజ్ఞను పొందకయే క్షీణించుచున్నది. ఒకానొకప్పుడది నీకు చెప్పకయే నాశమొందును. నీ ఇంద్రియములు, నీ మనస్సు నీ యాజ్ఞలేకయే నిత్యము విషయములయందు ప్రవర్తించుచున్నవి. నీ కిష్టము లేకపోయినను పాపకార్యములు చేయుచున్నవి. నీ శరీరేంద్రియములే నీ స్వాధీనములో లేనప్పుడు యీ ప్రపంచమంతయు నీ స్వాధీనములో నున్నదని తలంచుట మూఢత్వము. కామక్రోధాద్యంతశ్శత్రువులు నీ దేహేంద్రియ మనోబుద్ధుల నాక్రమించుకొని నిన్ను బానిసనుజేసి ఆటలాడించుచుండగా నేను సర్వజిత్తునని చెప్పుకొనుట హాస్యాస్పదము.

"నరణే విజయాచ్ఛూరోఽ ధ్యయనాన్నచ పండితః,
నవక్తా వాక్పటుత్వేన, నదాతా చార్థదానతః॥

అనగా యుద్ధమునందు జయించినంత మాత్రమున శూరుడు కాజాలడు. శాస్త్రములు చదివినంత మాత్రమున పండితుడు కాజాలడు.

వాక్చాతుర్యముతో మాటలాడిన మాత్రమున వక్త కాజాలడు. ధనమును దానముచేసినంత మాత్రమున దాత కాజాలడు. మరేమనగా

"ఇంద్రియాణాం జయేశూరో, ధర్మంచరతి పండితః
హితప్రియోక్తి భిర్వక్తా దాతా సన్మాన దానతః॥

అనగా ఇంద్రియ మనంబులను జయించినవాడే శూరుడనబడును. ధర్మాచరణము గలవాడే పండితుడనబడును. ఇతరులకు హితముగను, ప్రియముగను మాటలాడువాడే వక్త యనబడును. ఇతరులను సన్మానించువాడే దాత యనబడునని వ్యాస స్మృతియందు గలదు.

"యౌవనము, జీవనము, మనస్సు, ఛాయ, ధనము, ప్రభుత్వము నీ యారును చంచలములు. ఇవి స్థిరముగ నుండజాలవు. దీని యథార్థము నెఱిగినవాడే ధర్మమార్గమున వర్తించునని నీతిశాస్త్రమున గలదు, యౌవనము ముసలితనముచే గ్రసించబడుచున్నది. ఆరోగ్యము వ్యాధులచే హతమగుచున్నది. జీవితము మృత్యువుచే కబళింపబడుచున్నది. ఆశ మాత్ర మేయుపద్రవము లేక విరాజిల్లుచున్నదని భర్తృహరి చెప్పెను.

విద్యా, కామక్రోధాదులే పరమ శత్రువులు దుర్వాస మహర్షి మహాజ్ఞాని యైనను, క్రోధమునకు వశుడై నానావిపత్తులు పొందెను. కామమునకు వశులై ఇంద్రాది దేవతలుగూడ మహా కష్టముల ననుభవించిరి. మహా తపోవంతుడగు విశ్వామిత్రుడు రూప లావణ్యములు గల మేనకయను నప్సరసను జూచి మోహితుడై తపస్సునకు స్వస్తిచెప్పి యామెతో భోగవిలాసముల దేలెను. వశిష్ఠ మహర్షి పౌత్రుడైన పరాశరుడు పల్లెపడుచుయొక్క సుందర రూపమునకు మోహితుడై పట్టపగలే సంగమమునకు దార్చెను. ఇటువంటి మహర్షులే కామము నడుపజాలనపుడు సామాన్య మానవుల డంతురనుట కల్ల. కామక్రోధములు పితాపుత్రులగుదురు. వీరు

మహా బలవంతులు. వీరు సమస్త ప్రపంచమును జయించిన జయశీలురై విరాజిల్లుచున్నారు.

"కామేన విజితో బ్రహ్మా, కామేన విజితో హరిః,
కామేన విజితః శంభుః, శక్రః కామేన నిర్జితః॥

అనగా కామముచేత బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, మొదలగు వారందరు జయింపబడిరి. ఆత్మజ్ఞాన విహీనుల నందరను కామము జయించుచున్నది. ఆత్మజ్ఞానికి మాత్రమిది వశీభూతమగుచున్నది. కావున నీవు కామక్రోధాది శత్రువులను జయించి దేహేంద్రియ మనోబుద్ధులను నీ స్వాధీనమునందుంచుకొన్నచో నిన్ను నేను సర్వజిత్తని పిలిచెదను. అట్లు చేయనిచో సర్వజిత్తు నామము నీయందు నేతి బీరకాయ చందమగుననెను. తల్లి హితబోధ విని, లజ్జితుడై రాజ్యమును కుమారున కప్పగించి, యరణ్యమున కేగి తప మాచరించి, మహాత్ముల యుపదేశములచే కామక్రోధాది శత్రువుల జయించి, దేహేంద్రియ మనోబుద్ధులను తన స్వాధీనము నందుంచుకొని సర్వజిత్తను నామమును సార్థకపరచుకొనెను. ఈ కథాసంగ్రహమును వేదాంత జిజ్ఞాసువు లందరు గ్రహించి తదనుసరణతో ఆచరణతో సర్వజిత్తులు కాగలరని మదీయాకాంక్ష.

ఓం తత్ సత్

---

## గురు ఆవశ్యకత

మనము వేదాంత గ్రంథములు బాగుగా చదువగలిగినను, వాని యర్థము చక్కగా గ్రహించగలిగినను నాత్మయొక్క వాస్తవ స్వరూపము తెలియబడదు. వేదాంత గ్రంథములయందాత్మ సర్వవ్యాపకుడనియు, దేహత్రయమునకు ద్రష్టయనియు, నవస్థా

త్రయమునకు సాక్షియనియు పంచకోశములకు ప్రకాశకుడనియు చెప్పబడెను. అది సత్యమేయైనను శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడగు సద్గురువువలన దాని యథార్థ తాత్పర్యము తెలియనిచో నాత్మరూప ధనము లభించదు. ఇందులకు దృష్టాంతపూర్వకముగా ఒక కథ చెప్పెదను.

ఒక గ్రామములో ఒక గొప్ప ధనవంతు డుండెను. ఒకనా డతడు ఎవరికి తెలియకుండ పదునేను లక్షల రూపాయలను గుప్త పఱచెను. ఈ విషయము మఱెవ్వరికి చెప్పకుండ తన సొంత లెక్కలలో మాత్రము "శార్వరి నామ సంవత్సర చైత్ర శుద్ధ దశమి నాలుగు ఘడియల ప్రొద్దెక్కిన పిదప నాచే నిర్మింపబడిన శివాలయ శిఖరము నందు పదునేను లక్షల రూపాయలు దాచితిని. అవసరమైనప్పుడు నా పుత్రులు వినియోగపరచవచ్చు"నని వ్రాసియుంచెను, కొన్ని దినములు గడచిన పిదప నతడు మిత్రులతో తీర్థయాత్రలు సేవించుటకు వెళ్ళి యచ్చటనే మృతినొందెను. అతని వెంట వెళ్ళిన మిత్రులు ఆ విషయమును నతని పుత్రులకు చెప్పిరి. పుత్రులు తండ్రి మరణమునకు దుఃఖించి అతని అంత్యక్రియల నొనర్చిరి.

తరువాత కుటుంబ భారము తమమీద బడుటచేత వారు తండ్రిచేయు వ్యాపారము చేయసాగిరి. దైవయోగముచే వ్యాపారమున వారికి గొప్ప నష్టము కలిగెను. మరల వ్యాపారము చేయుటకు కొంత ధన మప్పుచేసిరి. కాని అదియు నష్టమయ్యెను. వారికి గ్రామమునం దెచ్చట అప్పు పుట్టకపోవుటచే నిట్లు విచారించిరి. మన తండ్రి గొప్ప ధనవంతుడని యందరు తలతురు. అతడు ధన మెచ్చటనైన దాచియుండును. ప్రాత లెక్కలను పరికించి చూచినచో నాడు తెలియగలదని తలంచి ప్రాత లెక్కల పుస్తకములను వెదకదొడగిరి. అందొకచోట దాత నామసంవత్సరమున బాకీదార్ల నుండి పదునేను లక్షల రూపాయలు వసూలైనట్లు ఉను

పొద్దులు కన్పించెను. మఱియొకచోట ఈశ్వరనామ సంవత్సరమున చైత్ర శుద్ధ దశమినాడు నాలుగు ఘడియల ప్రొద్దెక్కిన పిదప శివాలయ శిఖరమునందు పదునేను లక్షల రూపాయలు దాచబడినట్లు ఖర్చు వ్రాయబడి యున్నది. సాహుకారు కుమారులు సంతోషాంత రంగ భరితులై వెంటనే కూలీలను పిలిపించి శివాలయ శిఖరమును బడగొట్టించిరి. కాని వారి కచ్చట ధనముజాడ తెలియలేదు. చోరు లపహరించినట్లుకూడ కనిపించలేదు. ఋణదాతలు ఋణముల నిమ్మని తొందర చేయసాగిరి. గృహములో ఆహార పదార్థములేక పెక్కు ఇబ్బందులు పడుచుండిరి. శివాలయ శిఖరమును బడగొట్టించి నందుకు లోకులు నిందింపసాగిరి.

ఈ బాధలను సహింపజాలక సాహుకారు పుత్రులు తమ కులపెద్ద యొద్దకువెళ్ళి జరిగిన వృత్తాంత మంతయు చెప్పి ఆయ్యా! మాకు దిక్కెవ్వరు లేరు. వ్యాపారమున ధనము నష్టమయ్యెను. అప్పులధికమగుటచే ఋణదాతలు తొందరచేయుచున్నారు. ప్రాత లెక్కలను జూచి శివాలయ శిఖరము బడగొట్టించితిమి. ఫలితమేమియు లేదు. అందుకు లోకులు నిందించుచున్నారు. మమ్ములనేమి చేసినను సరే, మీరే దిక్కని ఏడ్వసాగిరి.

అప్పుడా వివేకవంతుడగు వృద్ధుడు వారల నోదార్చి ప్రాత లెక్కలను తెప్పించి వానిని తాను స్వయముగ చూచి చైత్ర శుద్ధ దశమి నాలుగు ఘడియల ప్రొద్దెక్కిన పిదప దాచితినను దాని యర్థమును గ్రహించి సాహుకారు పుత్రులతో విచారింపకుడు ధనము దొఱకగలదు. చైత్ర శుద్ధ దశమి దినమున మీరు నాయొద్దకు రండు. ఇప్పుడు నేను మీకు కొంత ధనమిచ్చెదను. దీనితో మీరు శివాలయ శిఖరమును నెప్పటివలె కట్టించుడు. అంతవరకు మీ కుటుంబపోషణకు కావలసిన భోజన సామాగ్రుల నిచ్చెదను, తీసుకొని పొండని చెప్పెను.

సాహుకారు కుమారులు సంతోషించినవారై యా వృద్ధుడిచ్చిన ధనమును, దానితోపాటు భోజన సామగ్రులను తీసికొనిపోయి, పూర్వమువలెనే మరల శివాలయ శిఖరమును కట్టించిరి. తరువాత వారు చైత్ర శుద్ధ దశమినాడు యా వృద్ధుని యింటికి వెళ్ళి యతనిని తీసికొని శివాలయమునకు వచ్చిరి. ఆ వృద్ధుడు నాలుగు ఘడియల ప్రొద్దెక్కినపుడు శివాలయ శిఖరచ్ఛాయ పడిన ప్రదేశమునుజూపి, బిడ్డలారా! మీ తండ్రి వ్రాసిన శివాలయశిఖరమిది. ఇచ్చట త్రవ్వించినచో ధనము లభింపగలదని చెప్పెను. అప్పుడు వారు కూలీలను పిలిపించి యా ప్రదేశమును త్రవ్వింపగా నచ్చట పదునేను లక్షల రూపాయలు కన్పించెను. లెక్కలయందుంచబడినను లేదు అక్షరములు స్పష్టముగా తెలియబడుచున్నవి. భాష బాగుగా నందరకు అర్థమగుచున్నది. కాని ధనముమాత్రము కన్పించుటలేదు. వృద్ధుడు పదునేను లక్షల రూపాయలకి చిన్న శిఖరమునం దెట్లుంతగలవని విచారించి లెక్కలలో వ్రాసిన విధముగ నా సమయమున శిఖరచ్ఛాయ బడిన చోట ధనము కలదని గ్రహించెను.

కాన వాక్యార్థము ప్రయోజనమెంతయు కానపుడు విచారించి లక్ష్యార్థములో ఫలము పొందుటయు వ్యవహారికముగా అనుభవజ్ఞులగు పెద్దలెట్లవసరమో, స్వరూపప్రాప్తి లాభమునకు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు గురువు లావశ్యకము. కాన సద్గురువనుగ్రహప్రాప్తి లేనిదే ఆత్మజ్ఞానము సిద్ధింపదు...

ఓం తత్ సత్

## యమ పతి ద్వ యమ వతి

మానవులు శాస్త్రనిషిద్ధ కర్మలు లాచరించుచున్నంత వఱకు యమధర్మరాజు శిక్షనకుబద్ధులై ఉత్తమాధమలోకములనుపొందుచు,

ఆ లోకములయందు కర్మఫలము లనుభవించి మరల భూలోకమున బుట్టి నానావిధములగు సంసార దుఃఖముల ననుభవింపవలయును.

ఒకానొక సమయమున యమలోకములో చిత్రగుప్తుడు లెక్కలను పరిశీలించి భూలోకమున రామచంద్ర పురమందున్న కోమటి సుబ్బిశెట్టి ఆయువు నేటితో తీరిపోయినదని యమధర్మరాజుతో చెప్పెను. యముడు తనభటులకు రామచంద్రపురము పోయి కోమటి సుబ్బిశెట్టి శరీరమునుండి జీవుని తీసికొని రండని చెప్పెను. అంతట యమభటులు సుబ్బిశెట్టి యింటికి వెళ్ళిరి. కుర్చీలో కూర్చొనియున్న సుబ్బిశెట్టి మీ రెవరని ప్రశ్నించెను. అందులకు వారు మేము యమ భటులము. నేటితో నీ ఆయువు తీరిపోయినది. నీ జీవాత్మను తీసికొని రమ్మని యమధర్మరాజు మమ్ములను పంపుటచే వచ్చితిమని చెప్పిరి.

వెంటనే సుబ్బిశెట్టి మిమ్ముల నే యముడు పంపినాడు? క్రొత్త యముడా? ప్రాత యముడా? యని యడిగెను. యమభటు లాశ్చర్యముతో నిద్దరు యములున్న సంగతి మాకు తెలియదనిరి. సుబ్బిశెట్టి అట్లయిన మీ ప్రభువు నడిగి తెలిసికొనిరండు, పొండని చెప్పెను.

యమభటులు ఇప్పుడితనిని తీసుకొనిపోయినచో నేమి ప్రమాదము సంభవించునో! విచారించి తీసికొని పోవుటయే మంచిదనుకొని యమలోకమునకు తిరిగివెళ్ళి యమధర్మరాజుతో అయ్యా! మేము సుబ్బిశెట్టి జీవుని తీసుకొని వచ్చుటకు వాని యింటికి వెళ్ళితిమి. అతడు మమ్ములనుజూచి మీరుక్రొత్తయముని భటులా? ప్రాతయముని భటులా? యని ప్రశ్నించెను. ఆ సంగతి తెలియదుగాపున దేవరవారి నడుగుటకు వచ్చితిమని చెప్పిరి. అంతట యమధర్మరాజు నాకును తెలియదు. ఈ విషయము మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది. బ్రహ్మదేవుడు మఱియొక యముని సృష్టించినాడేమో తెలియదు. కావున సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మదేవుని విచారించుదము రండని వారిని

వెంటబెట్టుకొని సత్యలోకమునకేగెను. వారిని చూచి, బ్రహ్మదేవుడు "యమధర్మరాజా! ఏదియో కార్యార్థమై వచ్చినట్లు తోచుచున్నదనెను.

యమధర్మరాజు చిత్తము. భూలోకములో రామచంద్రపురము నందున్న సుబ్బిశెట్టి జీవుని తీసికొని వచ్చుటకు మా భటులు వెళ్ళగా నతడు మీరు క్రొత్త యముని భటులా? ప్రాతయముని భటులా? యని ప్రశ్నించినాడట. తాము నన్ను గాక మరియొక యముని గూడ సృష్టించినారా? యని యడిగెను. నేను సృష్టించలేదు. ఒకవేళ విష్ణుమూర్తి ఏమైన సృష్టించినాడేమో నాకు తెలియదు. వైకుంఠము నకు వెళ్ళి వారిని విచారించవలెను రండని వారిని వెంటబెట్టుకొని వైకుంఠమునకు వెళ్ళెను.

వారిని జూచి విష్ణుమూర్తి "బ్రహ్మదేవా! నీ వాలకము చూడ నేదియో పనిమీద వచ్చినట్లున్నదే!" అని అడిగెను. బ్రహ్మదేవుడు చిత్తము. యమభటులు రామచంద్రపురమునందున్న సుబ్బిశెట్టి జీవుని తీసుకొని వచ్చుటకు వెళ్ళిరి. అప్పుడతడు యమభటులను జూచి మీరు క్రొత్త యముని భటులా? ప్రాత యముని భటులా? అని ప్రశ్నించినాడట. రెండవ యముని విషయము మాకు తెలియదు. తామేమైనా సృష్టించినారేమో! అని తెలిసికొనుటకు వచ్చితి మనెను.

విష్ణుమూర్తి నేను సృష్టించలేదు. ఒకవేళ శంకరుడేమైన సృష్టించినాడేమో విచారింతము. రండని వారి నందరిని వెంటబెట్టుకొని కైలాసమున కేగెను. వారిని జూచి శంకరుడు మీరందరొక పర్యాయమే యిచ్చటికి వచ్చుటకు కారణ మేదియో యుండునని తలంచి, అదియేమో కారణము తెలియజేయుడని వారి నడిగెను. అందులకు కారణములేక యుండునా! భూలోకములో రామచంద్ర పురమునందున్న కోమటి సుబ్బిశెట్టి జీవుని తీసికొని వచ్చుటకు యమభటులు వెళ్ళగా నతడు మీరు క్రొత్త యమునిభటులా? ప్రాత యమునిభటులా! యని ప్రశ్నించినాడట. ఇద్దరు యములున్న సంగతి

వృథా అయినదని నేను భావించుచున్నాను. పోనీ జ్యోతిష్యము చదివితివాయని అడిగెను బెస్తవాడు పడవనడుపుచు నేనీ జ్యోతిష్యము నేమియు నెరుగనని జవాబిచ్చెను. అదివిని పండితుడు భగవంతుడా! జీవితములో యింకొక పాతికభాగమును నాశనము చేసికొనినావురా వెఱ్ఱివాడా! తర్క-మీమాంస, జ్యోతిషములను మూడు శాస్త్రములను తెలియనివాడు ముప్పాతిక జీవితమును వృథాచేసికొనినట్లే యని అనెను. వాటిని తనవద్ద నేర్చుకొని జీవితమును ధన్యమొనర్చుకొనుమని యనెను—పడవ సరిగా నది మధ్యభాగమునకు వచ్చెను. నీటి ప్రవాహము చాల వడిగానుండెను. ఇంతలో పెనుగాలి వీచనారంభించెను. తుఫాను చెలరేగెను జలము ఉత్తుంగతరంగ సంయుక్తమై భీతిని గొల్పుచుండెను. తరంగముల తాకిడికి పడవ అటునిటు ఊగులాడుచు డోలాయమాన మగుచుండెను ఇంతలో పడవలో నీరు ప్రవేశింపసాగెను. పడవ మునిగిపోవునేమోయను భయము కలుగుచుండెను. ఆ ఘోర విపత్సమయమున బెస్తవాడు పండితుని పిలిచి "అయ్యా బాబూ, తమకు ఈతవిద్య వచ్చునా"? యని అడుగగా "రాదని" జవాబు చెప్పెను. అది విని పల్లెవాడు "మహాప్రభూ! తర్క-మీమాంస జ్యోతిషములు చదువనందున నా జీవితములో ముప్పాతిక భాగము మాత్రమే నాశనమైనది. "ఈతవిద్య రానందువలన తమ జీవితమిపుడు మొత్తము పూర్తిగా నాశనమైపోయినది; అన్ని పలికి యూరకుండెను ఇంతలో నీరు పడవలో విస్తృతముగా చేరి పడవ మునిగిపోయెను. పండితుడు గంగార్పణమయ్యెను. బెస్తవాడు ఈదుకొని ఒడ్డుచేరెను. చూచితిరా! నదీప్రవాహ మధ్యమున కాపాడినది ఈతవిద్య. ఆ సమయమున తర్క-మీమాంసా జ్యోతిషములాదిగా గల విద్యలేవియు రక్షింపలేవు. ఈతవిద్య ఒక్కటియే శరణ్యము. అట్లే జీవుడు సంసారసాగర మధ్యమున గ్రుంకులాడుచున్నాడు. అట్టివారికి తరుణోపాయము. బ్రహ్మవిద్యయే ఒకేఒకమార్గ

వార్తికకారు లాభాసవాదులు. జీవుడు చైతన్యాభాసమని వీరి సిద్ధాంతము. వీరి మతమునందు బింబభిన్నమును, బింబసదృశమునగు దర్పణాంతర్గత ప్రతిబింబమును కన్పించెడిశక్తి దర్పణాదులయందు గలదని చెప్పెదరు. ఈ విధముగ ప్రతిబింబవాదులు ప్రతిబింబము సత్యమనియు, ఆభాసవాదులు ప్రతిబింబ మసత్యమనియు చెప్పుచున్నారు. వీరుభయులు బింబము సత్యమని యంగీకరించెదరు. చైతన్యప్రతిబింబము చైతన్యమువలె జ్ఞానరూపమగును. ఆ జ్ఞానరూప ప్రతిబింబ సంబంధమువలన అంతఃకరణము ప్రమాతయగుచున్నది. "యోయం విజ్ఞానమయః ప్రాణేషు" అను శ్రుతి జీవుడు విజ్ఞానమయుడని చెప్పుచున్నది. కాపున జీవుడు చేతనుడు. "రూపం రూపం ప్రతిరూపం బభూవ" అను శ్రుతిచేత జీవుడు ప్రతిబింబి రూపుడని చెప్పబడెను. జీవుడు చేతనుడైనచో నతడు ప్రతిబింబుడు కాడు. ప్రతిబింబితుడైనచో చేతనుడుకాడు. కాపున నిందేది సత్యము?

ప్రతిబింబవాది మతమునందు ప్రతిబింబము నిజబింబమునకంటె భిన్నముకాదు. కాన చైతన్య ప్రతిబింబితుడగు జీవుడు చేతనుడే యగును. అచేతనుడు గాడు. అభాసవాది మతమునందు ప్రతిబింబము నిజబింబముకంటె భిన్నమైనను నది శుక్తిరజతాదులవలె ప్రాతిభాసికమనియు, నాప్రాతిభాసికా నిర్వచనీయ ప్రతిబింబమున కుత్పత్తిగలదనియు నంగీకరించుచున్నారు. ఆ యుత్పత్తికి నిజబింబము, నవిద్య యీ రెండును పాదానకారణములు. కావున ప్రతిబింబముతో బింబచైతన్యమునకు సంబంధము గలదు. జలప్రతిబింబ సూర్యునకు తేజస్సుండినట్లు, అంతఃకరణ ప్రతిబింబితుడగు జీవుడు చేతనుడే యగును. బింబ ప్రతిబింబవాదుల మతమునందు, ప్రతిబింబరూపజీవుడు చేతనుడే ఆభాసవాదుల మతమునందు జీవుడు చేతనాచేతన విలక్షణుడు. కాన జీవుడు చేతనముకంటె విలక్షణుడని రెండు మతములందును సిద్ధించుచున్నది.

అంతఃకరణమునందు చైతన్యము ప్రతిఫలించుటచేత ప్రతిబింబ మూలముగా అంతఃకరణము ప్రమాతయగుచున్నది. ఆత్మ చేతనము. అంతఃకరణము జడము. ఈ రెండిటియొక్క యేకత్వాధ్యాస వలననే అంతఃకరణము ప్రమాతయగుచున్నది. ఈ ప్రమాత ప్రమాణములద్వారా ప్రమేయముల నెఱుగుచున్నది.

ఓం తత్ సత్



## సాక్షి

ప్రమాత్రాశ్రయము ప్రమాత. ఆ ప్రమాతయే కర్తయు, భోక్తయునగు నాత్మ. దీపము తాను ప్రకాశించుటయందును నితర పదార్థములను ప్రకాశింపజేయుటయందును మఱియొక ప్రకాశము నపేక్షింపవలసిన పనిలేదు. కావున నిక సాక్షి నంగీకరించుటవలన ప్రయోజనమేమి?

ప్రమాత ప్రకృతిరూప పరిణామముగలది అగుటచే నది వికారి. పరిణామవంతమగు పదార్థము దృశ్యము. దృశ్యమెప్పుడును ద్రష్ట కాజాలదు. దృశ్యమగు ప్రమాత, దృశ్యమగు ప్రమేయమువలె తన వికారములను, ఉనికిలేములను తానెఱుగజాలదు. అసంగము, నిర్వికారమునగు నాత్మయే సర్వమునకుసాక్షి, స్వయంప్రకాశమగు సాక్షిచేతనే సర్వము ప్రకాశింపబడుచున్నది.

"దృగ్దృశ్యౌ పదార్థౌ ద్వౌపరస్పర విలక్షణౌ
దృగ్బ్రహ్మ దృశ్యం మాయాస్యాత్ ఇతివేదాంత డిండిమః

భావము:- దృక్, దృశ్యములని పదార్థములు రెండు. ఈ రెండును పరస్పర విలక్షణములు, అందు దృక్కు బ్రహ్మము,

దృశ్యము మాయ; అని వేదాంత డిండిమము. ప్రమాతకంటె భిన్నముగ స్వయంప్రకాశమగు సాక్షి యున్నదనుటకు శ్రుతియే ప్రమాణము.

శ్రు॥ "తమేవభాంత మనుభాతిసర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి" ఇటువంటి శ్రుతులు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, అగ్ని మొదలగునన్నియు స్వయంప్రకాశములుకావు, అవియన్నియు ఆత్మప్రకాశము వలననే ప్రకాశింపబడుచున్నవని చెప్పుచున్నవి. కావున ఆత్మ స్వయంప్రకాశమని నిశ్చయమగుచున్నది. దృశ్యము లగు ఘటపటాది పదార్థములు ఇతర పదార్థములను ప్రకాశింపజేయ జాలనట్లు, దృశ్యములగుటచే సూర్యాదిజడ జ్యోతిస్సులుకూడ స్వయముగ నితర పదార్థములను ప్రకాశింప జేయజాలవు. స్వయం ప్రకాశమగు నాత్మయే సర్వమునకు సాక్షి. ప్రమాణముల నుపయోగించు జాగ్రదవస్థయందు మాత్రమే ప్రమాతవ్యవహారము. జాగ్రదవస్థ అణగిన, స్వప్నావస్థను ప్రకాశింపజేయునది, యీ సాక్షి చైతన్యమే. సుషుప్తియందుకూడ సాక్షి చైతన్య మంగీకరించబడు చున్నది. సాక్షి చైతన్యము సత్యము, నిత్యము. సాక్షిశబ్దము మాత్రము సాక్ష్యముండునంతవరకు మాత్రమే. సాక్షిచైతన్యము పరమార్థము,

ఓం తత్ సత్

---

# శాస్త్ర విచారణావశ్యకత

తత్త్వమసీత్యాది మహావాక్యములు స్వతః ప్రమాణము లగును. ఆ స్వతఃప్రమాణజన్య జ్ఞానముచే నజ్ఞానము, నజ్ఞాన జన్యమగు ద్వైతప్రపంచము నివృత్తియగుచున్నది. ఇక విచారణవలన ప్రయోజనమేమి?

పగలు శుక్రనక్షత్రము చూచినవాడితరులతో నేను శుక్ర నక్షత్రమును చూచితినని చెప్పినప్పుడు, ఒకనికి పగలు శుక్రనక్షత్ర ముండునా? యుండదా? అను సంశయము కలుగును. వేఱొకనికి పగలు శుక్రనక్షత్ర ముండదను విపరీత బుద్ధి కలుగును. కాని వీరి ముగ్గురి నేత్రదృష్టి సమానముగానే యున్నది. అయిన ఒకనికి నిశ్చయము, మఱియొకనికి సంశయబుద్ధి, వేఱొకనికి విపరీతబుద్ధి కలుగుచున్నది. శుక్రనక్షత్రమును దర్శించినవాడితరులకు వృక్ష శాఖలమధ్య భాగమున దృష్టిని సారించి చూడుమని చెప్పగా నట్లు చూచినప్పుడు సంశయముగలవానికి మొదట శుక్రనక్షత్రము దర్శన మగును. విపరీతబుద్ధిగలవాడు విమర్శించి చూచినపిదప శుక్రనక్షత్ర దర్శనమగుచున్నది.

అట్లే సంశయ విపర్యయములేని యుత్తమాధికారికి వేదాంత మహావాక్యముల శ్రవణమాత్రముచేతనే యఖండ బ్రహ్మాకారవృత్తి కలిగి యది కార్యసహితముగ నజ్ఞానమును నివృత్తిచేయుచున్నది. సంశయబుద్ధి గలవానికి శ్రవణముచేసిన మహావాక్యముల యర్థమును సాధకబాధక యుక్తులచే మననము చేసినపిదప సంశయముతొలగి యఖండార్థజ్ఞానము కలుగుచున్నది. విపరీతబుద్ధిగలవానికి శ్రవణము చేసిన మహావాక్యముల యదార్థమును సాధకబాధక యుక్తులచే మననముచేసి పిదప సాధింపబడిన యర్థమునవచ్ఛిన్న తైలధారవలె నేకాకారముగ ధ్యానించుటచే విపరీతభావము నశించి, యఖండ బ్రహ్మాకారవృత్తి కలుగుచున్నది. కావున విచారణ మావశ్యకము.

తత్పదార్థము శాస్త్రతాత్పర్యమగుటచే శ్రేష్ఠమైనప్పటికిని, త్వంపదార్థము శాస్త్రజన్య మోక్షరూపఫలమునకు భాజనమగుటచే దానికంటెకూడ నిది శ్రేష్ఠమైనది. త్వంపదార్థ విషయములో దేహాత్మ వాదము మొదలు నిర్ధర్మవాదులవరకు ననేక భేదములు తెలియబడు చున్నవి. వీరిలోకొంద ఱాత్మ నిత్యమనియు, కొందఱనిత్యమనియు

చెప్పుచున్నారు. అనిత్యమని చెప్పువారుకూడ రెండు విధములుగ నున్నారు. దేహాత్మవాదులు మొదలు, క్షణిక విజ్ఞానవాదులవర కాత్మ సత్యము, ననిత్యమునుచున్నారు. మాధ్యమిక బౌద్ధులు మిథ్యాభూతమగు, నాత్మ యనిత్యమనుచున్నారు. ఆత్మ నిత్యమని చెప్పువారుకూడ రెండువిధములుగ నున్నారు. దిగంబరజైను లాత్మ పరిణామనిత్యమందురు. వైశేషికులు మొద లద్వైతులవరకాత్మ కూటస్థ నిత్యమనెదరు. అద్వైతమతమునం దుపనిషత్ప్రమాణములచే నాత్మ స్వరూపము నిర్ధారణ చేయబడెను. కాన శాస్త్రవిచారణ మావశ్యకము.

ఓం తత్ సత్



# చతుర్విధాభావ రహితాత్మ

ఆత్మకు కాలకృత, దేశకృత, వస్తుకృత పరిచ్ఛేదములు లేవు. దేహము మొదలు బ్రహ్మపర్యంతముగాగల సమస్త పదార్థములకు త్రివిధపరిచ్ఛేదము లున్నవి. ప్రాగభావ ప్రధ్వంసాభావములకు ప్రతియోగులగు పదార్థములు కాలకృతపరిచ్ఛేద్యములు. అత్యంతాభావమునకు ప్రతియోగులగు పదార్థములు దేశకృత పరిచ్ఛేద్యములు. అన్యోన్యాభావమునకు ప్రతియోగులగు పదార్థములు వస్తుకృత పరిచ్ఛేద్యములు. వేదాంత సిద్ధాంతమునందాత్మ తేయ భావము సంగీకరింపబడదు. కావున ఆత్మ త్రివిధపరిచ్ఛేదములు లేనిది. ఆత్మకంటె భిన్నములగు సమస్త పదార్థములకు చతుర్విధాభావము లున్నవగుటచే అవి త్రివిధ పరిచ్ఛేదములు గలవి.

ఆత్మకు ప్రాగభావ ప్రధ్వంసాభావము లున్నవని చెప్పిన నో నా యభావము లెఱుగునదేది? ఆత్మకంటె భిన్నములగు

నసాత్మపదార్థములు జడములగుటచే నవి ఆత్మయొక్క ప్రాగభావ ప్రధ్వంసాభావముల నెఱుంగజాలవు. వేదాంత సిద్ధాంతమునం దాత్మ యొక్కటియే యగుటచేత దాని యభావములనెఱుగు మఱి యొక ఆత్మ లేదు. కావున ఆత్మకు ప్రాగభావ ప్రధ్వంసాభావములు సిద్ధించవు.

ఆత్మ తన ప్రాగభావ ప్రధ్యంసాభావములను తానే యెఱుగ వచ్చునుగదా యనిన అట్లుకాదు.

ఆత్మయొక్క ప్రాగభావ ప్రధ్వంసాభావకాలమునందు ఆత్మ లేదు. ఆత్మయున్న కాలమునందు దాని ప్రాగభావ ప్రధ్వంసాభావములు సంభవింపవు. కావున నాత్మ తానెట్లు తన ప్రాగభావ ప్రధ్వంసాభావముల నెఱుగగలదు? అంతియేగాక ఆత్మకు ప్రధ్వంసాభావము నంగీకరించినచో నాత్మయున్నపుడు చేసిన పుణ్యపాపముల ఫలము ననుభవింపకయే నశించిపోవుననెడి కృతకర్మనాశ దోషము సంభవించును. అట్లే ఆత్మకు ప్రాగభావ మంగీకరించినచో నాత్మయే కర్మములను చేయకయే సుఖదుఃఖరూప ఫలముల ననుభవించునను అకృతాభ్యాగమదోషము కలుగును కావున ఆత్మకు ప్రాగభావ ప్రధ్యంసాభావములు లేవు.

ఆత్మ సన్మాత్రస్వరూపమని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. "ఘటోస్తి, పటోస్తి, అను వ్యవహారముచేతకూడ నాత్మ సర్వత్ర అనుగతముగ నున్నట్లు తెలియబడుచున్నది. సర్వత్ర అనుగతముగ వ్యాపించియున్న ఆత్మ కత్యంతాభావము కలుగదు. శుక్తియొక్క తాదాత్మ్యాధ్యాసచే మిథ్యారజతము ప్రతీతమైనట్లు ఆత్మయందు మిథ్యావస్తువులన్నియు నధిష్ఠానాత్మ తాదాత్మ్యమువలననే సిద్ధించు చున్నవి. ఆత్మ తాదాత్మ్యమువలన సిద్ధించెడి యనాత్మపదార్థము లతో నా కెప్పుడు భేదము కలుగదు. కావున నాత్మ కన్యోన్యా భావముకూడ సిద్ధింపదు. ఈ విధముగ ఆత్మయందు చతుర్విధా భావములు లేకపోవుటచే నది యేయభావములకు ప్రతియోగికాదు.

# చిదాత్మ - గౌణాత్మ - భిన్నమతవంటలం

చిదాత్మయొక్క గౌణస్వరూపమే చిదాభాసుడు. ఆ చిదాభాసుడు, తన గౌణస్వరూపము నశించి, ముఖ్యమైన చిదాత్మస్వరూపముగా నుండుటకొఱకు ప్రవర్తించుచున్నాడు. బంధమోక్షములు రెండును చిదాభాసునకే కలుగుచున్నవి. చిదాత్మ అవ్యవహారుడైనను, నజ్ఞానాహంకారోపాధులవలన నతడు వ్యవహరించుచున్నాడు. కేవల బ్రహ్మశబ్దమునకు, నహంశబ్దమునకు వాచ్యుడు కాకపోయినప్పటికి, నుపాధిగత చిదాభాస విశిష్టచిదాత్మ బ్రహ్మ అహంశబ్దములకు వాచ్యమగుచున్నది. వాచ్యార్థములయందు సాభాసోపాధి భాగము లను విడిచి, చైతన్యభాగమును గ్రహించినచో జహదజహల్లక్షణ సిద్ధించుచున్నదని ఆభాసవాదులు చెప్పుచున్నారు. వారు చిదాభాసాభిన్న చైతన్యమే తత్త్వంపదములకు వాచ్యార్థము. ఆవాచ్యార్థ ములయందొక భాగమును త్యజించి, మఱియొక భాగమును గ్రహించి నచో జహతజల్లక్షణ సిద్ధించునని ఆభాసవాదుల మతము.

ప్రతిబింబవాదులలో వివరణకారాదు లజ్ఞానోపహితబింబచైతన్య మీశ్వరుడు, సంస్కార సహితాంతఃకరణావచ్ఛిన్నాజ్ఞానప్రతిబింబ చైతన్యము జీవుడనియు, సంక్షేపశారీరకకారాదు లజ్ఞానప్రతిబింబిత చైతన్య మీశ్వరుడు, బుద్ధిప్రతిబింబచైతన్యము జీవుడు, నిరుపాధిక చైతన్యము శుద్ధమనియు చెప్పుచున్నారు. ఈ రెండు పక్షముల యందును బుద్ధుల భేదముచే జీవులనేకులు, ప్రతిబింబము పారమార్థిక బింబాభిన్నమగుటచే తత్త్వం పదములయందు జహదజహల్లక్షణ సంభవించునని బింబ ప్రతిబింబవాదులు చెప్పెదరు.

అజ్ఞానమునకు విషయమగు చైతన్య మీశ్వరుడు. అజ్ఞానమున కాశ్రయమగు చైతన్యము జీవుడని వాచస్పతి మిశ్రులనుచున్నారు.

ముఖ్యుడు. మిగతా శరీరములందున్న జీవులు కల్పితులు, కావున సర్వము మిథ్యయే యగును.

నానా జీవ వాదమునందుకూడ నొకజీవుని స్వప్నములో ననేక మిథ్యాజీవులు కల్పింపబడుచున్నట్లు. ఏకజీవ వాదమునందుకూడ నొకజీవుని కల్పనయే సమస్త జీవులని చెప్పబడును.

ముఖ్యజీవు డొక్కశరీరములోనే యుండును. ఇతర శరీరములు, నా శరీరములందున్న అంతఃకరణములు వ్యవహారదశలో నున్నట్లు తోచుచున్నను, నాశరీరములు, నంతఃకరణములు జీవులు మొదలగునవన్నియు ప్రాతిభాసికములని తలంచవలయును.

కావున వికల్పములన్నిటిని విడిచి యొక్క బ్రహ్మచైతన్యమునుమాత్రము గ్రహించినచో నన్నిమతములు నుపాదేయములే యగును.

ఓం తత్ సత్



# వ్యావహారికసత్త - పంచీకరణమం

[సత్తా "పారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము"అని మూడు విధములు. వానియందు బ్రహ్మచైతన్యముయొక్క సత్తపారమార్థికము. అవిద్య దాని కార్యమగు ప్రపంచము సత్తవ్యావహారికము. శుక్తిరాజతాదుల సత్తప్రాతిభాసికము. ఇందు ప్రాతిభాసిక పదార్థములు వ్యవహారిక దశయందుపయోగపడుటలేదు. పారమార్థికమగు నాత్మైక్యరూపస్థితియందు వ్యావహారిక పదార్థము లుపయోగపడుట లేదు. కాని ఉపాసనాది వ్యవహార దశయందు వ్యావహారికపదార్థము లుపయోగపడుచున్నవి కాన వాని నిరూపణమావశ్యకము.

శబ్దాత్మకయగు నాకాశరూపమును పొందిన అవిద్య, స్పర్శాత్మకమగు వాయువు నుత్పన్నము చేయుచున్నది. కారణ స్వరూపాంతర్గతమగు శబ్దము, కార్యమగు స్పర్శాత్మక వాయువునం దనువృత్తమగుచున్నది. కావున వాయువు శబ్దస్పర్శాత్మకమగు చున్నది. వాయుభావమును పొందిన యవిద్య రూపాత్మకమగు తేజస్సును పుట్టించుచున్నది. దానియందు కారణగుణము లనువృత్త ములై యుండుటచే, తేజస్సు శబ్దస్పర్శ రూపాత్మకమగుచున్నది. తేజోభావమునుపొందిన యవిద్యవలన, రసాత్మకమగు జలముత్పన్న మగుచున్నది. దానియందు కారణగుణములను వృత్తములై యుండుట చేత, జలము శబ్దస్పర్శ రూపరసాత్మకమగుచున్నది. జలభావము నొందిన అవిద్యవలన, గంధాత్మకమగు పృథ్వి యుత్పన్నమగు చున్నది. దానియందు కారణగుణములను వృత్తములై యుండుట చేత, పృథ్వి శబ్దస్పర్శ రూపరస గంధాత్మకమగుచున్నది. ఇంద విద్యయంతయు నాకాశముగ పరిణమించుటలేదు. అవిద్యయొక్క యొకభాగము మాత్రమే ఆకాశముగ పరిణమించుచున్నది. అట్లే ఆకాశముయొక్క యొకభాగమునందు వాయువును, వాయువుయొక్క ఏకదేశమునుండి తేజస్సును, తేజస్సుయొక్క యేకదేశము నుండి జలమును, జలముయొక్క యేకదేశమునుండి పృథ్వియును నుత్ప న్నములయ్యెను.

దిశలాకాశమునకంటె భిన్నములుకావు. "ఆత్మ నాకాశస్పం భూతః" అని శ్రుతికూడ చెప్పినది. కాల మవిద్యకంటె భిన్నము కాదు. "సొచ తమ ఆసీత్" అను నిటువంటి శ్రుతులు, కాలమవిద్య కంటె భిన్నముకాదని చెప్పుచున్నది. కార్యములు వాని కారణముల కంటె భిన్నములుకావు. "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" అను బ్రహ్మసూత్రముగూడ కార్యములు వాని కారణములకంటె భిన్నములుకావని చెప్పుచున్నవి. మృత్తికార్యములను ఘటశరా

గుణమైన సర్శమును, జ్ఞానశక్తి ప్రదాన సాత్వికాంశమువలన గలిగిన త్వగింద్రియ మెఱుగుచున్నది. క్రియాశక్తి ప్రదాన రాజసాంశమువలన గలిగిన పాణేంద్రియము చేయుచున్నది. అగ్నియొక సాత్వికాంశమువలన చక్షురింద్రియమును, రాజసాంశమువలన పాదేంద్రియమును గలిగెను. ఇందు అగ్నియొక్క ముఖ్యగుణమైన రూపమును జ్ఞానశక్తిప్రదాన సాత్వికాంశమువలన గలిగిన నేత్రేంద్రియ మెఱుగుచున్నది. క్రియాశక్తి ప్రదాన రాజసాంశమువలన గలిగిన పాదేంద్రియము రూపమునొద్దకు గమనము చేయుచున్నది. జలముయొక్క సాత్వికాంశమువలన జింహేంద్రియమును రాజసాంశమువలన గుహ్యేంద్రియమును గలిగెను ఇందు జలముయొక్క ముఖ్యగుణమైన రసమును జ్ఞానశక్తి ప్రధాన సాత్వికాంశమువలన గలిగిన జింహేంద్రియ మెఱుగుచున్నది. క్రియాశక్తిప్రదాన రాజసాంశమువలన గలిగిన గుహ్యేంద్రియము రసమును విడుచుచున్నది భూమియొక్క సాత్వికాంశమువలన ఘ్రాణేంద్రియమును, రాజసాంశమువలన పాయురింద్రియమును గలిగెను. ఇందు భూమియొక్క ముఖ్యగుణమైన గంథమును జ్ఞానశక్తి ప్రదాన సాత్వికాంశమువలన గలిగిన ఘ్రాణేంద్రియ మెఱుగుచున్నది. క్రియాశక్తి ప్రదాన రాజసాంశమువలన గలిగిన పాయురింద్రియము మలవిసర్జన చేయుచున్నది.

ఇదేవిధముగ సూక్ష్మ పంచభూతముల జ్ఞాన శక్త్యాత్మక సమష్టి సాత్వికాంశమువలన గలిగిన యంతఃకరణము పంచభూతములగుణములైన శబ్దస్పర్శ రూపరస గంధముల మంచిచెడ్డల విమర్శించి యెఱుగుచున్నది. అట్లే సూక్ష్మపంచభూతముల క్రియాశక్త్యాత్మక సమష్టి రాజసాంశమువలనగలిగిన ప్రాణవాయువు ప్రాణాపాన వ్యానోదాన సమానములను నైదువిధములుగ విభజించబడి క్రమముగా "హృదయము, గుదము, సర్వశరీరము, కంఠము, నాభి" అను నైదుస్థానము

అందుండి త్రిమహాశక్తి ప్రధానములగు కర్మేంద్రియములు వానివాని కార్యములను చేయుటకు శక్తినిచ్చుచున్నవి.

ఓం తత్ సత్



# లయ చింతన

లయము రెండు విధములు. కార్యము కారణమందు లయమగుట, కార్యకారణములు రెండును లయమగుట - ఇందు మూర్త పదార్థములు సూక్ష్మపదార్థములందు లయమగుట దైనందిన ప్రళయము. అమూర్త పదార్థములవ్యాకృతమునందు లయమగుట ప్రాకృతిక ప్రళయము. అవ్యాకృత సహితముగా సమస్త పదార్థముల లయము ఆత్యంతిక ప్రళయము. మూర్తామూర్తా వ్యాకృత భేదముచే పదార్థములు మూడు విధములు.

"ఆత్మనః ఆకాశః సంభూతః" అను శ్రుత్యనుసారము ఆత్మనుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలము నుండి పృథ్వి క్రమముగా కలిగెను. మరల నివి ప్రళయకాలమున క్రమముగా పృథ్వి జలమునందును, జలమగ్నియందును, అగ్ని వాయువునందును, వాయువాకాశమునందును ఆకాశ మాత్మయందును లయమగునని చెప్పబడెను. అట్లే జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల లయక్రమము చెప్పబడుచున్నది. జాగ్రదవస్థ స్వప్నావస్థయందును, స్వప్నావస్థ సుషుప్త్యవస్థయందును లయమగుచున్నవి. అట్లే జాగ్రదవస్థాభిమానియగు విశ్వుడు స్వప్నావస్థాభిమానియగు తైజసునియందును, స్వప్నావస్థాభిమానియగు తైజసుడు సుషుప్త్యవస్థాభిమానియగు ప్రాజ్ఞునియందును లయమగుచున్నాడు. ఈ విధముగా మూలకారణమువరకు లయచిం

తన చేయుట ముముక్షువునకు కర్తవ్యము. ఈ యుద్దేశముతోనే శంకర భగవత్పాదులు లయచింతన నాదరించిరి.

అజ్ఞానాద్ బ్రహ్మణోజాత మాకాశం బుద్ బుదోపమ్
ఆకాశాద్ వాయురుత్పన్నో వాయోస్తేజస్తతః పయః
అద్భ్యశ్చ పృథివీజాతా తతోవ్రీహియ వాదిరమ్."

భావము:- ఆకాశమునుండి వాయువును, దానినుండి తేజస్సును, దానినుండి జలమును, దానినుండి పృథివియును, దానినుండి వ్రీహియవాది సస్యములును కలిగినవి. ఇది అనులోమక్రమము.

"పృథివ్యప్సు పయోవహ్నౌ వహ్నిర్వాయౌ నభస్యసౌ.
నభోఽ వ్యాకృతే తచ్చ శుద్ధేఽ స్మ్యహం హరిః॥

భావము:- పృధ్వి జలమునను, జలము అగ్నియందును, అగ్ని వాయువునను, వాయువు ఆకాశమునను, ఆకాశమవ్యాకృతము నను, అనగా మాయయందును, మాయ శుద్ధబ్రహ్మమునను వెలయు చున్నవి. నేనా శుద్ధుడనగు హరిని, ఇది విలోమక్రమము. ఇట్లు శ్రీ శంకరాచార్య విరచిత బ్రహ్మానుచిన్తనమ్ నందు చెప్పబడి యున్నది.

అద్వైత సిద్ధాంతమునందు సమస్త జడపదార్థములు చైతన్యము నకుపాధులు. ఇందు వ్యష్ట్యుపాది చైతన్యము జీవుడు. సమష్ట్యుపాధి చైతన్య మీశ్వరుడు. చైతన్యమున కుపాధియగు జడజాతమవస్థా బేధముచే స్థూల సూక్ష్మకారణములని మూడు విధములగును. ఇందు పంచీకృత పంచమహా భూతాత్మక దృశ్యజగత్తు స్థూలము. ఈ స్థూల జగత్తునకు కారణమగు నపంచీకృత భూతాత్మకము సూక్ష్మము. ఈ సూక్ష్మమునకు కారణమగు మూలాజ్ఞాన మవ్యాకృతము. ఈ మూడును వ్యష్టి సమష్టి బేధములచే జీవేశ్వరులకు ప్రత్యేక ప్రత్యేకముగా మూడుమూడుపాధులగుచున్నవి. ఇందు వ్యష్టి స్థూలోపాధిక

జీవచైతన్యము విశ్వుడు. వ్యష్టిసూక్ష్మోపాధిక జీవచైతన్యము తైజసుడు, వ్యష్ట్యవ్యాకృతోపాధిక జీవచైతన్యము ప్రాజ్ఞుడు. అట్లే సమష్టి స్థూలోపాధిక యీశ్వరచైతన్యము విరాట్టు. సమష్టి సూక్ష్మోపాధిక ఈశ్వర చైతన్యము హిరణ్యగర్భుడు. సమష్ట్య వ్యాకృతోపాధికచైతన్య మీశ్వరుడు.

ఈశ్వరునకు రజోగుణము ప్రధానముగా నున్నపుడు బ్రహ్మ యనబడుచున్నాడు. సత్వగుణము ప్రధానముగా నున్నపుడు విష్ణువనబడుచున్నాడు. తమోగుణము ప్రధానముగా నున్నపుడు రుద్రుడనబడుచున్నాడు. నిరుపాధిక చైతన్యము బ్రహ్మమనబడు చున్నది. ఈ విధముగా ఉన్నదియు, సద్వితీయము, నిరవయవము, స్వప్రకాశచైతన్యమునందు ఉపాసకుల యభీష్టానుసారము చతుర్భుజాదిమూర్తి కల్పనచేయబడినది. ఇందు రజోగుణోపాధికుడగు బ్రహ్మ చతుర్ముఖుడనియు, సతనిభార్య భారతియనియు, సత్వగుణోపాధికుడగు విష్ణువు చతుర్భుజుడనియు, సతనిభార్య లక్ష్మియనియు, తమోగుణోపాధికుడగు రుద్రుడు పంచముఖుడనియు, సతనిభార్య భవాని యనియు, చెప్పబడినది. మఱియు దృగ్రూపచైతన్యమే దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మపాలన నిమిత్తము శుద్ధసత్వప్రదాన మాయోపాధికుడై మత్స్యకూర్మాద్యనంతావతారములు లీలగా ధరించె నని చెప్పబడినది.

"కార్యార్థం ఉపాసకానాం బ్రహ్మణోరూపకల్పన" అని శ్రుతి వాక్యము.

ఓం తత్ సత్



# అవస్థాత్రయము

మానవుడు తనకు కన్పించు అనగా పంచేంద్రియములకు తెలియబడు విషయములనే పరిశీలించుచుండును. కొందరు మనస్సునకుతోచు సుఖదుఃఖాదులను గురించి, శాస్త్రవిషయములను గూర్చి విచారించుచుందురు. కాని తెలిసికొనువానిని అనగా ఆత్మనుగురించి విచారించువారరుదు.

మానవుడు ఒక దినములో మేల్కొని వ్యవహరించుచున్నాడు కలతనిద్రలో స్వప్నము గాంచుచున్నాడు. సుషుప్తిలో గాఢనిద్రలో ఏమియు తెలియక యున్నాడు. ఇట్లే ప్రతిదినము, ప్రతిసంవత్సరము జరుగుచున్నది. కాన ఒక దినములో అనగా ఇరువది నాలుగు గంటలలో జాగ్రత్తు. స్వప్నసుషుప్తులను పొందుచున్నాడు. ఈ అవస్థలను పరిశీలించినచో తెలిసికొను తెలివిని గురించి పరిశీలించిన వారమగుదుము.

జాగ్రదవస్థ ఇంద్రియములకు వ్యక్తులుగలుగునట్టి పదార్థజ్ఞానము కలుగునది జాగ్రదవస్థ. జాగ్రదవస్థయందు మూర్తపదార్థములు ప్రత్యక్షాది ప్రమాణములచే వ్యవహరింపబడుచున్నవి, కావున నవి వ్యవహారములనబడును. ఈ వ్యావహారిక పదార్థములు విశ్వుడనెడి జీవునిచే ననుభవింపబడుచున్నవి. దేహేంద్రియములయందు ప్రవేశించి వ్యాపించి యుండుటచే జాగ్రత్ జీవుడు విశ్వుడనబడుచున్నాడు. విశ్వుడనుమానాది ప్రమాణములచే నమూర్తపదార్థములను, నవ్యాకృతమును నెఱుగుచున్నప్పటికిని, వ్యావహారిక జగత్తును విశ్వుడెఱుగుచున్నాడను నియమముచేతను, స్థూలశరీరాభిమాని యగుటచేతను, నతనికి స్వప్నసుషుప్త్యవస్థల వ్యాపకత్వము లేదు. స్వప్నావస్థ జాగ్రదవస్థలయందు భోగములనిచ్చు కర్మ

చైతన్యవివర్తము, తూలావిద్యాపరిణామమున గురజ్జు సర్పాది పదార్థములు ప్రాతిభాసికములు. మనోఽవచ్ఛిన్న చైతన్యవివర్తనములును, దేని పరిణామములుకాని శశశృంగాదులు తుచ్ఛములు.

అద్వైత వేదాంత దర్శనమునందేయే పదార్థములు పరిణామములగునో, ఆయా పదార్థములు వివర్తములుకాదనగును. ఈ విధముగా పరిణామము వివర్తముయొక్క వ్యాప్యము. అట్లే యేవి యేవి వివర్తములో నవియవి మూలావిద్యయొక్కగాని, తూలావిద్య యొక్కగాని పరిణామములగును. ఇది నియమము, పరిణామత్వము, వివర్తత్వము అను నీ రెండు ధర్మములు సమనియతములు. కావున స్వప్నపదార్థములు దేనిపరిణామములు కావనుమతము సరికాదు, స్వప్నపదార్థములు, నాపదార్థజ్ఞానములు సమవ్యాప్తపరిణామము లగును,

జాగ్రదవస్థయందు మనస్సుయొక్క సాహాయ్యముచేతనే ఘటపటాదుల జ్ఞానము కలుగుచున్నది. కావున అవస్థాద్వయమందు స్వయంజ్యోతిష్ట్వము సిద్ధించుటలేదు. స్వయముగా ప్రకాశించుటయే స్వయంజ్యోతిష్ట్వము. స్వప్నావస్థయందు మనోవృత్తి లేకపోయినను నచ్చట నవిద్యావృత్తి యంగీకరించబడుచున్నది. ఆ యవిద్యావృత్తి మనస్సునందున్న సంస్కారముల సహాయ్యముతోగాని, లేక యిదమాకార మనోవృత్తి సహాయ్యముతోగాని కలుగుచున్నది, కావున భ్రమస్థలములలో, మనస్సునందు జ్ఞానకారణత్వమున్నది. స్వప్నావస్థయందు "అత్రాఽయం పురుషః స్వయం జ్యోతిర్భవతి" అను శ్రుతి స్వప్నావస్థయందు ఆత్మ స్వయంజ్యోతియని చెప్పుచున్నది. స్వప్నమునందు మనస్సే జగదురగాద్యాకారములుగా పరిణమించుచుండుటచే నదిదృశ్యకోటిలోనిదగును. కావున నాత్మకు స్వయంజ్యోతిష్టము సిద్ధించుచున్నది. అందువలన స్వప్నపదార్థములు సాక్షిభాస్యములనబడుచున్నవి.

సుషుప్త్యవస్థ:- "సుషుప్త్యేకసిద్ధం" ఆత్మ సుషుప్త్యవస్థకు సాక్షి కావున సుషుప్తియందు సాక్షికభావము లేదు. సుషుప్తియందు సాక్షి లేనిచో జాగ్రదవస్థయందు నేను మూఢుడనై నిద్రించితినను స్మరణ కలుగదు. ప్రమాత, ప్రమాణము, ప్రమ, ప్రమేయము ఇవి పరస్పరములు భిన్నములైనప్పటికిని వాని సత్తాసత్తల నెరిగెడి సాక్షి మూడుకాలములందును నాశములేనిదగును. సుషుప్త్యవస్థయందు మూఢత్వానుభవము లేనిచో జాగ్రదవస్థయందు మూఢత్వ స్మరణ కలుగనేరదు. సుషుప్తిలో మూఢత్వానుభవమున్నది కావున నా యనుభవమువలన సంస్కారములు కలుగుచున్నవి. ఆ సంస్కారములవలన మూఢత్వస్మరణము కలుగుచున్నది.

ఇట్లు జాగ్రత లోనున్నపుడు స్వప్న సుషుప్తులు లేవు. స్వప్నము లోనున్నపుడు జాగ్రత్ సుషుప్తులు లేవు. సుషుప్తియందు జాగ్రత్స్వప్నములు లేవు. కేవలము నిద్రానుభవము. ఈ అవస్థాత్రయము దేనియందులోన లీనమగుచున్నదో అదియే ఆత్మ-మన స్వరూపము. అది సత్యమై, నిత్యమై, అజమైయున్నదని తెలిసికొను మానవుడే ధన్యుడు.

ఈ అవస్థాత్రయమును గురించి మాండూక్యోపనిషత్తు, మాండూక్యగౌడపాదకారికలయందు పూర్తివివరములను గ్రహించగలము. శ్రుతులు యతోవా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి తద్బ్రహ్మేతి యనియు జన్మాద్యస్య యతః అని బ్రహ్మసూత్రములు చెప్పుచున్నవి. ఆత్మకు అవస్థాత్రయము కల్పితములని శాస్త్రములు చెప్పుచున్నవి.

ఓం తత్ సత్

# ఉపలంభము : ఆశ్రయాంశం

## సుఖమహమస్వాప్సం, నకించిదవేదిషం

సుఖమహమస్వాప్సమ్ నకించిదవేదిషమ్

అర్థము:- నేను సుఖముగనిద్రించితిని. నాకేమియు తెలియదు.

జాగ్రత్స్వప్నావస్థల భోగములవలన పరిశ్రాంతుడైన జీవుడు పై రెండవస్థలకు కారణములైన కర్మములు నష్టములగుటచే జ్ఞానశక్త్యవచ్ఛిన్న వాసనాసహితాంతఃకరణము తనకు కారణమైన యజ్ఞానమునందు లయమగుచున్నది. అదియే సుషుప్తి. ఆ యవస్థయందు జీవుడు విశ్రాంతిని పొందుచున్నాడు. ఈ విధముగా "నకశ్చిదవేదిషమ్" కారణమాత్రముగానుండు అవస్థ సుషుప్తి. ఈ లక్షణమునకు ప్రళయమునందతివ్యాప్తి గలదు. కావున ప్రళయము యొక్క కారణమునందుపలంభపదము చెప్పబడెను. ప్రళయకాలమందవిద్య, మూలస్వరూపముగానున్నది. ఆ సమయమునందు దానికే వృత్తియు లేదు. సృష్టికాలమునందవిద్య కజ్ఞానాకారమగు ప్రాథమిక వృత్తి కలుగుచున్నది. ఆయజ్ఞానాకారవృత్తి జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలయందు కలిగియుండును. అవస్థాత్రయమునందు గూడ "నేను బ్రహ్మనెరుగను" అను ప్రతీతి కలుగుచున్నది. ఈ ప్రాథమికావిద్యావృత్తి వ్యావహారిక శబ్దాదిజ్ఞానమునకు విరుద్ధము కాదు. కావున కేవలము ప్రాథమికా విద్యావృత్తివలన సుషుప్త్యవస్థ యుపపాదింపబడుటలేదుగాని, వ్యావహారిక శబ్దాదిజ్ఞానమును నిరోధించెడి యవస్థావిశేషమగు నజ్ఞానాకార యవిద్యయొక్క యన్యవృత్తి సుషుప్త్యవస్థయందవశ్య మంగీకరింపబడును. కావున సుషుప్త్యవస్థ యందు సాక్ష్యాకారమును, సుఖాకారమునకు నవిద్యయొక్క మరి

వానికాశ్రయమగు నహమర్థమునకు ప్రతీతికావలయును. సుఖాజ్ఞానముల కాశ్రయమగు నహంభావము సుషుప్తియందు లేదు. అహంభావముయొక్క ప్రతీతినంగీకరించినచో సుషుప్తియే యభావమగును.

సుఖమహ మహమస్వాప్సమ్, నకించిదవేదిషమ్॥ అను ప్రతీతి కనురోధమగుటచే సుషుప్తియందవిద్య యంగీకరింపబడుచున్నది. సుషుప్తియందవిద్యావృత్తి నంగీకరించుటచే సుషుప్తికి ప్రళయమునకు వైలక్షణ్యము సిద్ధించుచున్నది. స్మరణ మనుభవజ్ఞానజన్యము. జాగ్రత్తయందు కలిగెడి స్మరణరూపమగు కార్యముచే సుషుప్తియందలి యనుభవ మనుమానింపబడుచున్నది. అనుభవము వృత్తి రూపము. కావున సుషుప్తియందలివిద్యావృత్తియుండినట్లు విదితమగుచున్నది.

వాస్తవముగా నహంకారము స్మరణాశ్రయము కావలెను సాక్షి చైతన్యమే స్మరణకాశ్రయమగును. అనుభవియే స్మరణకాశ్రయమగును. ఇది నియమము. ఇచ్చట సాక్షిచైతన్యమే అనుభవి యగును గాని, అహంకారము గాదు, సుషుప్త్యవస్థయందు అహంకారము లీనమగుచున్నదిగదా?

వ్యావహారిక మనస్సుయొక్క తాదాత్మ్యముచేతనే యవిద్యాకల్పిత మనస్సున కధ్యాస కలుగుచున్నది. కావున కల్పితమనోవృత్తివలన కలిగిన సంస్కారములు, కల్పిత మనోధ్యాస కధిష్ఠానమగు వ్యవహారిక మనస్సునందే కలుగుచున్నవి. ఈ విధముగా సుషుప్త్యవస్థలో సాక్షియందు తాదాత్మ్యాధ్యాసచే నవిద్యాకల్పిత సాక్షి సుఖాజ్ఞానముల ననుభవించుచున్నది. కాన దానివలన కలిగిన సంస్కారములు, మనస్సునకు కారణమైన యజ్ఞాన విశిష్టసాక్షియందు కలుగుచున్నది. ఇందువలన జాగ్రదవస్థయందు కార్యమగు మనోవిశిష్ట సాక్షిదే వాని స్మరణ కలుగుచున్నది. కాని స్మరణ మనోవృ

ణామము కాదు. స్మరణకు విషయములగు పదార్థములన్నియు సాక్షి భాస్యములు.

ముఖ ప్రతిబింబమున కాశ్రయమైన యద్దమునందు జపా పుష్పముయొక్క రక్తవర్ణముద్భూతమైనప్పుడు ముఖమెఱ్ఱగానున్నట్లు ప్రతీతమగుచున్నది. అభివ్యక్తమైన లౌహిత్యమునకును, ముఖప్రతిబింబమునకు ఆశ్రయము దర్పణమగును. ప్రతిబింబము లౌహిత్యమున కాశ్రయముకాదు. అయినను లౌహిత్యమును, ప్రతిబింబము నొక దర్పణమందే సామానాధికరణ్యము కలవియగుచున్నవి. కావున ముఖమెఱ్ఱగానున్నదని ప్రతీతి కలుగుచున్నది. అట్లే స్మరణకు, అహంకారమునకు నొక్క సాక్షిచైతన్యమే యాశ్రయమగుటవలన నవి రెండును సాక్షిచైతన్యమునందు సామానాధికరణ్యముగలవి యగుచున్నవి. అందువలన స్మరణకాశ్రయత్వ మహంకారమైనట్లు ప్రతీతమగుచున్నది.

సాక్షిచైతన్యము సుషుప్తియందనుభూతములైన సుఖాదులను జాగ్రదవస్థయందు అహంకారాశ్రయత్వము స్మరించుచున్నది. జాగ్రత్కాలమునందలి స్మరణకాశ్రయమైన సాక్షిచైతన్యమే యహంకారమునకుకూడ నాశ్రయమగుచున్నది.

"స్మృతి, సంశయము, విపర్యయము" అను నీ మూడును సాక్షిచైతన్యాశ్రయములు. ప్రమాణ జన్యజ్ఞానమునకహంకార మాశ్రయము. ఇది నియమము. అహంకారజన్యజ్ఞానము ప్రమ అవిద్యా జన్యజ్ఞానము భ్రమ. ప్రమాజ్ఞాన మహంకారజన్యము.

ఈ విధముగ సుషుప్త్యవస్థయందానంద మనుభవింపబడుచున్నది. ఆ యానందము ననుభవించు సుషుప్త్యవస్థాభిమానియగు జీవుడర్థాంతరజ్ఞాని యగుటచేతను, సుషుప్తియందు సుఖాకారా, జ్ఞానాకారావృత్తులుండుటచేతను, ఇతర విషయావచ్ఛేదము లేకపోవుటచేతను, ప్రత్యగ్జ్ఞానవంతుడగుటచేతను ప్రాజ్ఞుడనబడుచున్నాడు,

సుషుప్తియందు "సతాసోమ్య సంపన్నోభవతి" అను శ్రుతి జీవున కీశ్వరునితో నభేధము ప్రతిపాదించుచున్నది. ఈ ప్రతిపాదన జీవునకా సమయములో దేహేంద్రియాదుల యందభిమానము లేకపోవుటచేత నౌపచారికముగా చెప్పినది. ఆత్మప్రమాతృ, ప్రమాణ ప్రమేయములయభావమునకు కూడ సాక్షియేయగును.

మూర్తపదార్థ వ్యవహారములుగల జాగ్రదవస్థ "అ" కారము, అమూర్తపదార్థ వ్యవహారములుగల స్వాప్నావస్థ "ఉ" కారము, నవ్యాకృతస్థితిగల సుషుప్త్యవస్థకు "మ" కారవాచకములు. వాచ్యవాచకములు ఆ భేధములు. ఇవియన్నియు పరస్పరవ్యతిరేకములు, దృశ్యములు నగుటచే మిథ్య. వీని కధిష్ఠానమగు శుద్ధచైతన్యము తురీయము. అది సర్వానుగతము. ఆ తురీయచైతన్యమే సాక్షి. ఆ సాక్షియే సత్యము అదియే నేను. ఈ సాక్షిని విధిముఖముగా బోధించెడి శబ్దములుగాని, శాస్త్రములుగాని లేవు. ఇది యమాత్రా బోధ్యము. మౌనవ్యాఖ్యానముచే గ్రహింపదగినది.

ఓం తత్ సత్



# ఏకాత్మ ప్రత్యయసారం

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వా స్వవస్థా స్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహమి త్యంతస్స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయాముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

టీ॥ బాల్యాదిషుఅపి=బాల్యము మొదలుగాగల యవస్థల యందును,జాగ్రదాదిషు=జాగ్రదవస్థ మొదలయినఅవస్థలయందును, తథా=అట్లు; వ్యావృత్తాసు = పరస్పరభిన్నములైన; సర్వాసు=

సమస్తములయిన; అవస్థాస్వపి అవస్థలయందును; అనువర్తమానం= అనువర్తించుచున్న; అన్తః లోపల; అహమితి=నేనుఅని; సదా= ఎల్లప్పుడును; స్ఫురంతం ప్రకాశించుచున్నవాని; స్వాత్మానం=తన యాత్మనుగా; యః ఎవ్వడు; భజతాం = సేవించువారలకు; భద్రయా మంగళకరమయిన; ముద్రయా=జ్ఞానముద్రచేత; ప్రకటీకరోతి తెలియజేయుచున్నాడో; తస్మై అట్టి; శ్రీగురుమూర్తయే= శ్రీమంతుడైన గురువుయొక్క ఆకారముగల; శ్రీదక్షిణామూర్తయే= శ్రీదక్షిణామూర్తికొరకు; ఇదం ఈ; నమః నమస్కారము; (అస్తు= అగుగాక.)

మాయయొక్క మిథ్యాభ్యాసమును వదలిన నిజమైన ఆత్మ స్వరూపమును గుర్తించు విధము ఇక్కడ చూపించబడుచున్నది నేను అను ప్రత్యయమునకు నిజమైన విషయమేది అని పరిశీలించుట ద్వారా నిశ్చయించవచ్చును. మాండూక్యం ఏడవ మంత్రము "ఏకాత్మ ప్రత్యయసారమ్" అను విశేషణముతో చూపించినది,

నేనుఅనతోచు ఈ దేహము మరియొకసారి మనకు విషయముగా తోచుచున్నది. అనగా నా దేహమని చెప్పుచున్నాము. నాకు విషయమై తెలియవచ్చుచున్నది. చిన్నతనమున తల్లి ఒడిలో యుంటిని. పెద్దఅయినతర్వాత పాఠశాలయందు చదువుతూ యుంటిని. మరికొంతకాలం పెద్దఅయినపిమ్మట వివాహమాడి గృహస్థుడనైతిని. ఇట్లే బాల్యము, యౌవనము, కౌమారము, వార్థక్యము అను అవస్థలు దేహము పొందుచున్నది. ఇదే బాల్యాదిషు అనగా. ఈ అవస్థలు వరుసగా మార్పుచెందుచున్నప్పటికి "నా"యందు ఏ మార్పు కలుగలేదు. పై అవస్థల అనుభవములన్నియు నాయందుండుచున్నవి. ఆ మార్పులను చూచుచున్న నేనుమాత్రము అలానేఉండి నిల్చియుండుటగాంచుము. ఈవిధముగా ఆత్మప్రత్యయము-చేత నేను అనుజ్ఞానము-దేహము, ప్రాణము, ఇంద్రియములు,

మనస్సు బుద్ధి-వీటన్నిటిని అనుసరించుకొనియున్న నేనే ఆత్మఅని ఈ ప్రత్యయముద్వారా నిశ్చయించ వచ్చును. శ్లోకములోని "వ్యావృత్తాస్వను వర్తమాన" అనగా వ్యావృత్తాసు మార్పుచెందుచు వేరువేరుగా కన్పించు బాల్యాది అవస్థలయందన్నిటియందున "అను వర్తమానం "నేను, నేనని అనువర్తించుచున్నది. కాన మార్పులేని "నేను" నందు మారుచున్న అవస్థలు తెలియబడుచున్నవి. నేను సత్యము, బాల్యాది అవస్థలు ఆభాసలు.

ఆత్మను ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియ వీలులేదు, ఎందువలననగా అతని ననుసరించియే ఈ ప్రమాణములన్నియు తమతమ విషయములను చూపించుచున్నవి. ప్రమాణములు, ప్రమాణములుచూపు విషయములు మారుచున్నను. వాటిని విషయీక రిస్తున్న ఆత్మయే నేను. అందువల్ల దీనిని విషయి అందురు. కాన ఆత్మప్రత్యయముద్వారా తెలిసికొనవలెనేగాని, తెలియబడునట్టి విషయముగా తెలియుటకు వీలులేదు.

నేను ఇదిఅను విభాగముద్వారా మన లోపలబయటా కనబడే దంతయు మన ఆత్మకు విషయమై ఉంటుంది.

రోడ్డు సెంటరులో దీపపుస్తంభము తాను కదలక ఒకచోటునే యుండినను, అటు నిటు పోవు వాహనములను, ప్రాణులను, మనుష్యులను ప్రకాశింపజేస్తూ కనుపింపజేయునుగదా!. అవిధముగనే బాల్యాదిఅవస్థలు వచ్చిపోవుటను ఎప్పుడూ ఈ ఆత్మ తన స్వరూపమైన జ్ఞానముతో ప్రకాశింపజేస్తూ మహాప్రదీపమువలె ఉన్నాడు. మార్పులన్నిటిని తెలిసికొనే సమయమున ఈ ఆత్మ యందు ఏ మార్పు కలుగుటలేదు. ఈ ఆత్మస్వరూపమును మన మున్నదనిగాని లేదనిగాని తెలిసికొనుటకు వీలులేదు. అన్ని విషయములను తెలిసికుంటున్న ఈ ఆత్మస్వరూపము ఉన్నది అనుట అనుభవమాత్రంతోనే మనకు గుర్తుగలుగును.

ఇదినే మాండూక్యోపనిషత్తు ఏడవ మంత్రమున ఏకాత్మ ప్రత్యయసారం అని వర్ణించినది. అనగా వ్యావర్తించియుండు అవస్థా త్రయమును అనువర్తించియుండునదేదియో దానినే ఏకాత్మప్రత్యయ సారమని తెల్పినది. ఆ మంత్రమునందు దానినే పండ్రెండు విశేష ములు ప్రతిషేధపరములు. ఇందుచే ఆత్మ శూన్యమగునేమోయని దానిని నివారించుటకై చివరియైన విశేషణములచే సద్దాని అస్తి త్వమును చెప్పి "స ఆత్మా స విజ్ఞేయః" అని ముగించినది. బాల్యాద్యవస్థలు ఏవిధముగా విభిన్నముగాను వ్యావర్తితలైయున్నాయో ఆ విధముగానే జన్మ మరణములును అవస్థలుకూడ ఆత్మను అంటవు. ఎందువలననగా దేహము పుట్టినప్పుడు ఆత్మస్వభావము పుట్టుకకలది కాజాలదు. దేహము చనిపోవుటవలన అది చావదు. (బృ. 44-4-25) "సవాఏష మహానజ ఆత్మా అజరో అమరో అమృతో అభయం బ్రహ్మ" అని చెప్పు చున్నది. అనగా ఈ మన ఆత్మే జన్మలేని మహాఆత్మ. ఇతడు ముసలితనము, చావులేనివాడు. చావులేని స్వభావము కలవాడు. భయములేనివాడు. బ్రహ్మము అని శ్రుతిచాటుతున్నది. ఈ ఆత్మ నిత్యమైన అనుభవము తాను ఉన్నట్లేయుండు స్వభావముగలదై యున్నది. ఇన్ని వివరముల బాల్యాదుల అనుదానిని పరిశీలించి నిత్య వస్తువిచారం చేయవలెను.

జాగ్రదాదులు అనుదాని పరిశీలించి చూతము. ఈ రెండు అవస్థాత్రయములలోను ఒకదానికంటె యొకటి విలక్షణమైయున్నది. బాల్యాదులు ఒకదానినుండి ఒకటి వస్తున్నట్లు కనబడుచున్నవి. జన్మనుండి మరణమువరకు కలుగు దేహముయొక్క వికారములు ఒకదానినుండి యొకటి వస్తున్నట్టికి ఈ దేహాదులు నాకేసంబంధ పడినవో అను భ్రాంతి కలుగుచుండును, బాల్యము మొదలు ముసలితనమువరకు వచ్చుటలో గుర్తులేనివిధముగా మార్పులు కలిగి నను, మనముంటిమి దేహమే ఈనాదేహము అనుభావన మనల

వికల్పములకు సాక్షిగాయుంటూ తనచైతన్యముతో అన్ని వికల్పము లను వ్యాపించుకొనియున్న ఈ అద్వైతస్వరూపము శ్రీ దక్షిణా మూర్తియైన పరమేశ్వరునియొక్క భక్తులకే దొరకును. అతడే మన బుద్ధి వృత్తులను ధర్మమార్గమునకు త్రిప్పి స్వరూపజ్ఞానమును అనుగ్రహించును. ఎవరు పరమేశ్వరుని విషయమున విముఖులో, ఎవరు లౌకిక విషయభోగములయందే ఆసక్తిరిలిగియుందురో, వారికి ఈ రమార్థము ఆత్మేఅయియున్నది ఏ ప్రయోజనము కలుగజేయ కున్నది.

ఇట్లు విపేకశాలురు ఉపనిషత్తులు చెప్పు అహంబ్రహ్మాస్మి తత్త్వమసి ఇత్యాది మహావాక్యములయందిమిడియున్న గర్భితార్థ మును గ్రహించగలిగి పరమశాంతినిపొంది ఆమ్కులై కృతార్థు లగుదురుగాక.

ఓం తత్ సత్



# మిథ్యాచారవం

భ॥గీ॥ 3-6, కర్మేంద్రియాణి సంయమ్య, య ఆస్తే మనసాస్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా, మిథ్యాచారస్స ఉచ్యతే॥

తా॥ అర్జునా! వాగాదికర్మేంద్రియములను మాత్రము నిగ్ర హించి, శబ్దాదివిషయములమ మనస్సుతోస్మరించుచుండెడి మూఢుడు మిథ్యాచారుడనబడును.

రాగద్వేషాది దుర్గుణములచే దూషితమైన మలినాంతఃకరణ మును గలవాడు కుతూహలముతో, వాక్పాణిపాదాది కర్మేంద్రియము లను నిరోధించి, రాగద్వేషాదులచే ప్రేరేపింపబడిన మనస్సుతో శబ్దస్పర్శాది విషయములను స్మరించుచు, నాత్మతత్త్వమునుగూర్చి

కరణముగలవాడు వాగాది కర్మేంద్రియములను నిరోధించి మనస్సు తోను, శ్రోత్రాది జ్ఞానేంద్రియములతోను, విషయములందనురాగ ముతో ప్రవర్తించుచు, పరమపురుషార్థమగు మోక్షమునకు దూరమగు చున్నాడు. పరిశుద్ధాంతఃకరణముగలవాడు మనస్సును, శ్రోత్రాది జ్ఞానేంద్రియములను, శబ్దాది విషయములనుండి నిరోధించి, వాగాది కర్మేంద్రియములతో ఫలేచ్ఛారహితముగ కర్మలనుచేయుచుండినను, పరమపురుషార్థరూపమగు మోక్షమును పొందుచున్నాడు. కావున చిత్తశుద్ధిలేని మిథ్యాచారి సన్న్యాసికంటె, చిత్తశుద్ధికొఱకు నిష్కామ కర్మలననుష్ఠించు కర్మయోగి అత్యంత శ్రేష్ఠుడునని గ్రహింపవలెను.

ఓం తత్ సత్



# గురు పాదుకాపూజ - దాని విశిష్టత

మనము మన దృష్టిలో దేనిని గొప్ప విలువైనదానినిగా తలంతుమో దానిని సహజముగా పూజింతము. దేనికైతే మనము విలువ నిచ్చెదమో అది మన జీవితములో అర్థవంతమై యుండును. ఏదోమార్గంగా దానిని గుర్తుంచుచునే యుందుము. మనము మన మాతృభూమిని ప్రేమించుచుందుము. గనుక మన జాతీయపతాకము నకు వందనమిడి హృదయపూర్వకంగా జాతీయగీతమును పాడెదము.

రామాయణములోని రామ పాదుకలను గురించి విస్తారముగ వ్రాయబడినది. రాముని పాదుకలు సింహాసనమునందుంచి పదు నాలుగు సంవత్సరములు భరతుడు రాజ్యమేలెను. అనగా రాములవా రధిష్ఠించిన పాదుకలను రాములవారిగనే భావించి, వారి ప్రతినిధిగా రాజ్యపాలన చేసెను.

శ్లో॥ యదంఘ్రికమలద్వంద్వం । ద్వంద్వతాపనివారకం ।
తారకంభవసింధోశ్చ । శ్రీగురుం ప్రణమామ్యహం॥

